# విషయసూచిక.

# తొలిపలుకు

"అల్లనాటి భరతవర్షీయ కార్మికప్రౌఢిదలచి
వేడికన్నీరు విడువనివాడు కలడె."

భారతీయసోదరులారా !

ఈభారతీయవిశాల మహాసామ్రాజ్యమున గతించిన వేయిసంవత్సరములనుండి యెన్నెన్ని రాజకీయమతసాంఘిక కల్లోలపరంపర విస్తరిల్లినవో, నాటినుండి నేటివరకు భారత ప్రజాకోటి యెంతెంతదుర్భరకష్టములపాలైనవో, యేయే సమయములం దెట్టిసుఖసన్నివేశముల గాంచినవో, ఎంతమందిమహా పురుషులు పుట్టి గిట్టిరో, ఏయేప్రదేశము లేయేవిషయంబులైన మార్పులను జెందినవో, యెన్నిరత్నస్థగితములైన పుణ్యభూములు భూగర్భమున నింకినచో, ఎన్నెన్ని నూతన విశాలదేశములు వెలసినవో, ఏకాలమున నేయేవిజ్ఞానవల్లరులు భారత దేశపుపందిరికి ప్రాకి పూచి, కాచి, ఫలించినవో, శుష్కించినవో మనము సంపూర్ణముగా యథార్థస్థితిగతులను దెలియవలె నన్న మనకు తెల్లవారు భూతభవిష్యద్వర్తమానములలో తమ కనుకూలముగా నుండునటుల వ్రాయించి, ప్రచురించిన చరిత్రములేకదా యాధారములైనవి.

ఆచారిత్రకాంశములలో నూటికి నూరువంతులుగూడ నయథార్థప్రపత్తిపూరితములే యని నేటిజాతీయచారిత్రకపరిశోధకులు చెప్పుచున్నారు. అంతేగాదు. వానిని నిజాంశములతో తీర్చిదిద్ద యత్నించుచున్నారు. కాని యందలి జాతీయ ప్రతిభాలేశమైన జనసామాన్యము గుర్తింపజాలకున్నది. ఇక ముందు వారికిగూడ నిదే గతి పట్టునేమో? ఎవరుచెప్పగలరు? ఎవరికి వారే స్వయముగా తమహృదయకుహరంబులం దుద్భవించిన భావపరంపరను రూపుమాపి శుష్కక్రియులగుచున్నారు. కాని కాలప్రవాహముమాత్ర మాగక· నిర్మలగంగాఝరీవేగతుల్యముగా ముందునకుబర్వెత్తుచున్నవి మనకుతర్వాతవారికైన మనము మనలోపములను సవరించుకొని వారికి మార్గదర్శకులుగా భారతీయదేశక్షేమాభిలాషులుగ నుండుమంచిదశ కలుగజేయలేమా? ఇదియే నేటిభారతనాయకుల రాజకీయసమస్య.

ఈసమస్యను బురస్కరించుకొనియే కాంగ్రెసుసంస్థ ముప్పది యేండ్లనుండి బ్రిటిషుప్రభుత్వముతో ముష్టాముష్టి, బాహాబాహి, కచాకచి పోరాటం సల్పకపోయినా, అహింసా యుధాన్ని పదునుబెట్టి పోరాటం సాగిస్తున్నది. వానిఫలితమే యీనాటి తాత్కాలికప్రజాపరిషత్తు స్వరూపం. అయితే దేశంలోవుండే వేరొకపలుకుబడిగల సంస్థ కేవలం స్వార్థపరత్వంకోసం పదేపదే కాంగ్రెస్ సంస్థయొక్క స్వాతంత్ర్యకార్యకలాపానికి అడ్డుతగులుతూ చుక్కెదురై విజృంభించి చికాకుకలిగిస్తోనే వున్నది. ఈచికాకులను యేవిధంగానైనా విడగొట్టు

కొని సంపూర్ణస్వాతంత్ర్యసాధనిర్మాణానికి పునాదులు వెయ్యాలని యత్నిస్తూనే వున్నారు. నేటి రాజకీయవేత్తలందరినీ తన గుప్పెటలో నిముడ్చుకొని రాజప్రతినిధియైన వేవెల్ ప్రభువు తన రాజకీయచాతుర్యనాటకములో సిమ్లాసమావేశము, అమాత్యరాయభారాగమనము అనే రెండురంగాలను ప్రదర్శించి ముస్లింలీగు తెరను చాటువేసికొని మూడవరంగానికి ప్రస్తావనగా కొలది రోజులక్రిందట రాజకీయవేత్తలకు తలమానికమైన జవ్హారు పండితుని, సిక్కులోకానికి కిరీటంలేని రాజైన బలదేవసింగును బలవంతంగా లండనునగరరంగానికి రప్పించి రసాభాసుచేసి పంపించారు. రాజప్రతినిధియైన వేవెల్ యింకా లండనులో మంతనాలు జరుపుతూ తనరాజకీయనాటకానికి మంగళహారతి పాడనేలేదట. ఇది యింకా బ్రిటిష్వారు భారతదేశంలో విభజించి పాలించు అనే నీతిశాస్త్రపాఠాన్ని వప్పగించడమే అవుతుంది అనడం సాహసమూ కాదు. భారతదేశంలో దమననీతి సాగిస్తూ వుండటానికే నిశ్చయించుకున్నారని, మూటలు కట్టుకొని పోవడానికి తయారుగాలేడని చెప్పడానికి జంకనవసరమూ లేదు.

వేవెల్ ప్రభువు ఆదినుంచీ సైనికజీవితం సాగించిన వీరుడనీ, ఆయనకు రాజకీయవిజ్ఞానపాండితి తక్కువనీ అనుకున్న భారతరాజకీయవేత్తలు ఆయనచూపిన రాజకీయచాతుర్యానికి విభ్రమాశ్చర్యాలు పొంది పిల్లిమొగ్గలు వేశారు. బ్రిటిషు ప్రధానమంత్రియైన అట్లీ ఆస్యబింబమునుండి వెలువడేవి అమృత

వాక్కులా ? విషబిందువులా ? అని శంకింప వలసివస్తున్నది. ఏది ఎలాగున్నా బ్రిటిషుప్రభువులు భారతదేశాన్ని ఓపట్టానవిడిచి వెళ్లడమనేది సంభవింపదు. అందుకెన్నో నిదర్శనాలు కనిపిస్తున్నాయి. అందులో కాస్తో నిజమైనప్రేమో, సవతితల్లిప్రేమో చెప్పలేముగాని అమెరికనులు భారతీయులంటే అపారగౌరవం చూపుతారనే విశ్వాసం భారతీయులకుద్దు. ఆవిశ్వాసలేశాన్ని నాశనం చెయ్యడానికి బ్రిటిషువారు కొద్దికాలంక్రిందట ఇండియా నుంచి భారతీయులంటే అమెరికనులకు అసహ్యం, ఆగ్రహం కలిగేటట్లు చెయ్యండని ధనాశాపూరితులై, స్వదేశాభిమాన శూన్యులై, బ్రిటిషుబానిసలైన కొంతమందిని అమెరికాదేశానికి పంపారు. వాళ్ళక్కడ ఏవో అవాకులూ - చవాకులూ పేలి కావలసినంత ఎంగిలికూడు తిని వాళ్ళభోషాణాలను కరెన్సీ నోట్లతో నింపుకున్నారు.

ఇదంతా గమనించిన రాజకీయాభిజ్ఞురాండ్రగు వనితామణులలో నగ్రగణ్యయు, సుప్రసిద్ధదేశాభిమానపూరితకుటుంబజన్యయు, విద్యావిశారదయు, మహోపన్యాసకురాలునైన శ్రీమతి విజయలక్ష్మిపండిట్ భారతీయులకు అమెరికనులపై గల గౌరవప్రేమభావాలను బహిరంగమొనర్చి, భారతదేశము యొక్క నిజమైనపరిస్థితు లెఱిగించి, భారతీయులకు అమెరికనులతో సుహృద్భావం పెంపొందించడానికి నడుముకట్టి అహోరాత్రములు తనయకుంఠితదేశాభిమానమును వెల్లడించుకొని, అంతర్జాతీయమహాసభలో భారతీయులకడగండ్లను విప్పిచెప్పిన

వీరవనిత శ్రీమతి విజయలక్ష్మీపండిట్ విజ్ఞానవతియొక్క సంపూర్ణ జీవితమును వివిధవిచిత్రసంఘటనలతో వివరింపబడినది. దీనివలన మాతృదేశవాసు లెంతమంది యిట్టి పరిస్థితుల నెదుర్కొనగలరో గ్రహింపవలెను. ఈభారతీయరమణీరత్నము జాతీయనాయకురాండ్రకంఠసీమ వెలుంగు హారములకు నాయకరుణి. ఇందలి రసవత్తరఘట్టముల జదివిన యాడువాండ్రట్టే వర్తింపవలెనని, మగవాండ్రు అట్టితల్లులుగాని, అట్టితనయగాని, లభించిన బాగుండునని యువ్విళ్ళూరుదురు.

ఇట్లు
రచయిత.

# ఉపక్రమణిక

"ద్యుమణి పద్మాకరము వికచముగ జేయు
కుముదహర్షంబు గావించు నమృతసూతి
యర్థితుండుగాక జలమిచ్చు నంబుధరుడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు."

ఇరువదవశతాబ్దంలో భారతదేశం కేవలం రాజకీయ రంగమే కాకుండా, తన కేమీ సంబంధము లేకపోయినా యుద్ధరంగంగా కేవలం మారకపోయినా, భారతదేశపుసరి హద్దులుమాత్రమే శత్రువులు తొక్కినా యుద్ధవాతావరణము లోని వివిధములైన ఒత్తిడులకు గురికావలసివచ్చింది. ఎలాగైతేనేమి ఆయుద్ధశృంఖలాలని విడిపించుకో గలిగిందికాని శాంతిసౌఖ్యాలను నిర్భరంగా స్థిరీకరించుకో లేకపోతోంది. దానికి హేతువేమా అని పరిశోధనలు సలపడంవల్ల ప్రయోజనమే కాన్పించేటట్టు గోచరించదు. శాంతిస్థాపననే నిజంగా కోరే రాజ్యాలు అసలు భారతదేశంతప్ప యింకొకటి లేదనే చెప్పాలి. ప్రపంచశాంతిస్థాపనకు యత్నిస్తున్నామని చెప్పే బ్రిటిషువారికి మనశ్శాంతే లేదు. యుద్ధవిరమణసంతోషం కూడా లేదు. ఆయుద్ధసమయంలోకూడా తంత్రాలు, కుట్రలు, పన్నాగాలు పన్నడమే దీనికంతకూ ముఖ్యకారణం. ఆపన్నాగాలు మొదలగువానివల్ల ఎట్టిదుష్ఫలితాలు ఏర్పడుతాయో అన్న భీతాంగంపట్టుకుంది.

ఓమూల బ్రిటన్ మాట చెపితే రష్యా ఉఱుముతోంది. ఫ్రాంకో పళ్ళు కొఱుకుతున్నాడు. అమెరికామాత్రం లోలోపల కుళ్ళిపోతోంది తానుకూడా బ్రిటిషువారితో పన్నాగాలు పన్నడంలో ఎందుకు చేతులు కలిపావా అని ఓప్రక్క భారత దేశం మీరు యీపాటికి మూటాముల్లె కట్టండి. మాదేశాన్ని మేము పాలించుగోగలం. అయితే యింతకాలాన్నించి మనం మనం కలిసి ఉన్నాం కాబట్టి బుద్ధికలుగుంటే మాతో సమానముగా మిమ్మల్ని గౌరవిస్తాం. మీపాతఉద్యోగాలు మీరు చేసుగోండి. కొత్తయుద్యోగాలు కోరకండి. వెంటనే మీ సైన్యాలను ఓడెక్కించండి వట్టిచేతులతో మావాళ్ళల్లోను పకడబందీగా పేల్పులు పేల్చేవారు, కాల్పులు కాల్చేవారు, కత్తి తిప్పేవాళ్ళు, అవసరంవస్తే బాంబులు చేసి విసిరేవాళ్ళు సిద్ధంగా వున్నారని మంచిగానే చెపుతోంది. అయితే కదలడాని కిష్టంలేదో, ఈరత్నగర్భని వదలిపోయి రాళ్ళు రప్పలూ తినమా అనో యింకా చాటుచాటుగా పిల్లిమీద యెలకనీ, యెలకమీద పిల్లనీ యెక్కించి తంటాలు పడుతూనే వున్నారు. భారతీయులలో మరికొందరు దురుసువాళ్ళు పెందరాళే తిన్నగా వెళ్ళిపోతారా? మెడ పట్టుకుని సాగనంప మంటారా అంటున్నారు.

అయితే యిలాంటి రహస్యవిషయాలన్నీ జనసామాన్యం తెలుసుగోడం కష్టమే. తెలుసుకున్నా పెద్దల ఆలోచన లేనిదే ఏపనీ చేయకూడదు. చేసినా అది తుదినెగ్గదు. ఇంక

రాజకీయక్షలపెద్దలు కొందరు తొందరపడకండి నాయనా! ఎల్లావచ్చారో అలాగే సాగనంపుదా మంటున్నారు. ఇలా అనేవారిలో మగపెద్దలూ వున్నారు. ఆడపెద్దలూ వున్నారు. మగపెద్దలు మనదేశంలోనే కీచులాడుతున్నారు. ఆడపెద్దల్లో ఒకావిడ కాలుగాలిన పిల్లిలా దేశమంతటా తిరుగుతూ విప్లవ జ్వాలలు రేకెత్తిస్తున్నది ఇంకొకావిడ విదేశాలలో తన రాజకీయవిజ్ఞానప్రతిభను విరజిమ్ముతూ భారతజాతి శక్తిసామర్థ్యాలను, ప్రాచీనపుటౌన్నత్యాన్ని, ప్రపంచశాంతితోబాటు భారత జాతికిగూడా మనశ్శాంతి కల్గించి వాళ్ళయిల్లువాళ్లే రక్షించుకొని సమర్థించుకొని లోటుపాట్లను చూచుకొని సర్దుకొంటారు. మీరీవలకి వచ్చెయ్యండని నచ్చచెప్పడానికి నల్లేరుమీదబండిలా అహోరాత్రాలు చరచరా తిరుగుతూ ఢంకా బజాయించుతోంది. ఆ సాహసికురాలు, ఆ దేశభక్తాగ్రగణ్య, ఆ రూపాందిన కలియుగరమాదేవి శ్రీమతి విజయలక్ష్మియే. నిన్నమొన్నటిదాకా అమెరికాదేశంలో భారతీయుల విజ్ఞానసంపత్తిని, మేధాశక్తిని, సుహృద్భావాలను, మనోవాంఛలను, ప్రదర్శించి బంగారుహారతులందుకొన్నది. ఆమానినీమణి జీవితచరిత్రలోని రత్నకదంబాలని మాలికగా గ్రుచ్చి భారతమాతకంఠసీమను హారాకృతిగా అమర్చడమే యీజీవితచరిత్ర వ్రాయుటలో ప్రధానాశయం. ఈ శేముషీవిభవసంపన్న రాజకీయప్రవచనాలు విదేశాలలోని మహావక్తల మనస్సౌధాలను కూకటివేళ్ళతో పెల్లగించాయి. ఆమె భారతనారీమణులకు నేడొకపట్టుగొమ్మ.



# జననము.

" ఎవ్వనికి విజ్జగంబున నెంతఫలము
దైవకృతమగు నది పొందు దప్పకతని
కారణముగాదు పెనుబ్రాపు ఘనుని జేరు
చాతకముపాలబడు నల్పజలకణములు."

భారతదేశాని కుదీచీదిశను తొల్లి కాళిదాసాదిమహా మహాకవులచే తనప్రకృతివైభవమును వర్ణింపజేసికొని మించిన హిమాలయపర్వతం బలరారుచున్నది. అనగశిఖరమునుండి గంగానది మహోన్నతధారలుగ నుద్ఘోషధ్వానములతో ప్రవహించుచుండును. ఈప్రాంతమును దేవభూమియన్న నసత్యము కానేరదు. అచటి ప్రకృతిసౌందర్యమును వర్ణింప నూహాతీతమైనది. అచ్చటకు వాయువ్యదిశను ప్రకృతిజన్యరామణీయక దృశ్యముల కాటపట్టయి, సకలకళారాధకులకు నిలయమై మేటి విజ్ఞానసీమయై, చందనాద్యమూల్య తరురాజంబులతో, మొగలి గులాబి మున్నగు మనోహరలతాకదంబులతో పాంథులకు నాకర్షణీయమై కాశ్మీర మలరారుచుండును. అచటిమానవ లోక మించుమించుగా తొల్లింటి ఆర్యులని చెప్పవచ్చును. రూపధైర్యసాహసోదారపరాక్రమములు కాశ్మీరులకు పుట్టుకతోనే యుండుననుటయు చిత్రగానేరదు.

పదునారవశతాబ్దాంతమున పరమత భూషణుడును, హిందూమతద్వేషియునైన ఔరంగజేబుపరిపాలనతో మొగలాయిసామ్రాజ్య మంతరించుటచే కాశ్మీర దేశ మశాంతికి గురియైనది. ఆకారణమున నా దేశములోని జనులు పరప్రదేశములకు వలసపోవలసివచ్చెను. అందులో కొందరు ఢిల్లీనగరమును జేరిరి. వారిలో నెహ్రూలని కాలక్రమమున ప్రసిద్ధి జెందిన వంశీయులకుటుంబముకూడ కలదు. అప్పటికి ఢిల్లీచక్రవర్తి రాజకౌలు అను నాకుటుంబయజమాని పాండిత్యప్రకర్షను యాహ్వానించి పారశీకసంస్కృతభాషలందు దపారపాండితీ భావిలసితుడని గ్రహించి రాజకుటుంబములలోని బాలబాలికలకు విద్యాగురువుగ నేర్పరచి యొక విలువగల జాగీరునిచ్చి యాదరించెను.

కాలక్రమమున మరిరెండు తరములనాటికి మొగలాయీలప్రభుత్వము సంపూర్ణముగ నంతరించినట్లే నెహ్రూల జాగీరుకూడ నంతరించినది. ఆవంశీకులలో లక్ష్మీనారాయణ నెహ్రూ ఢిల్లీలో బ్రిటిషుకంపెనీవారికి ప్రథమన్యాయవాదిగ నుండెను. ఆయనకొమారుడు గంగాధరనెహ్రూ ఢిల్లీలోనే కొత్వాలుగ నుండెను. 1827 లో సిపాయీల తిరుగుబాటు ఢిల్లీలో జరిగినప్పుడు గంగాధరనెహ్రూ సకుటుంబముగ ఢిల్లీ నగరమును విడిచి ఆగ్రాపట్టణమును ప్రవేశించెను. ఆసమయమున భారతీయసేనలును, నిజాంసైన్యమును బ్రిటిషువారికి సాయపడి శాంతినెలకొల్పి బ్రిటిషుబావుటాను నిలిపినవి. గంగా

ధరనెహ్రూకు నిద్దరుకుమారులు, ఇద్దరుకుమార్తెలు నుండిరి. అందు కడపటిపుత్రుడు పండిత మోతీలాల్ నెహ్రూ.

మోతీలాల్ నెహ్రూ పెద్దవాడైన పిదప కాశ్మీరములోని సుప్రసిద్ధబ్రాహ్మణ కుటుంబమునకు చెందిన రూపవతియు, గుణవతియు, విద్యావతియునైన స్వరూపరాణియను వనితా మణిని పెండ్లాడెను. ఆదంపతులే మనకథానాయికయగు విజయ లక్ష్మికిని, నేటిభారతజాతీయనాయకులలో మేటికిరీటమనందగు జవహర్‌లాల్ నెహ్రూకును ప్రియతమజననీజనకులు. క్రీస్తు శ. 1900 సంవత్సరములో ఆగస్టునెల 18 వ తేదీని అలహాబాదులో నాపుణ్యదంపతులలో నొక ఆడశిశువు జన్మించెను. జవహర్ నెహ్రూ అంతకుముందే 14-11-1889 లో జన్మించెను. అప్ప టికి నెహ్రూపండితునకు పదునొకండేండ్లవాడు. అప్పటికి మోతీలాల్ నెహ్రూ అలహాబాద్‌లో న్యాయవాదవృత్తియందు ప్రఖ్యాతి గాంచియుండెను. ఈబాలిక యెట్టి శుభసమయమున జన్మించెనో, ఎట్టిమహత్తరదివ్యలగ్నమున, ఎట్టిదివ్యగ్రహసంప త్కూటమున నామె యవతరించెనో ఆ శుభసమయమును దైవజ్ఞులు గణించి గుణించిరేని యిట్టియట్లని సామాన్యయని వచింపకుందురా ? ఆరమాలలామకు కాంతఁపింపజేయుసూపము ఆరూపమునకు వన్నెదెచ్చునైగనిగ్యము, దానికి రేఖలు దిద్ద గల్గిన శాంతము, దానిని మూర్తీభవింపజేయు చురుకుదనము, అద్దానిని దోహదమొనర్చు సాహసము, ఆసాహసము నేర్చి కూర్చిన విజ్ఞానము నాబాలికామణికి ప్రకృతిజన్యములై చిన్ని వన్నెలగూర్చు నల్లారుముద్దుల మూటయై విరాజిల్లెను.

4

అంతేగాక యామూర్తిత్వమును దాల్చిన లక్ష్మీదేవి ప్రతిబింబమగు నబ్బాలిక గుణరూపవిశేషాదులను గాంచి కనిన వారెల్ల రేగాక యింటిలోనివారుగూడ నామెను 'స్వరూప్' అని పేరున బిలుచుచుండువారు. ఆమె జన్మించినది మొదలు మోతీలాల్ నెహ్రూకు ధనాదాయము హెచ్చెను. దానితోబాటు ఆయనన్యాయవాదవృత్తియు కొన్నిరెట్లు వృద్ధిజెందెను. ఇది యంతయు నదృష్టసంకేతాలైన స్వరూప్ జననకాలఫలితమే యని నిశ్చయించుకొన్న తత్కుటుంబములోనివారందరామె నతిగారాబముతో జూచుచు సర్వసౌఖ్యముల ననుభవించుచు క్రమక్రమముగా నాభిజాత్యమును వృద్ధిపొందించుకొనుచుండిరి. మోతీలాల్ నెహ్రూ కేవలము విద్యాసంపన్నుడే కాడు. పౌరుష జ్ఞానకీర్తుల వంశము ప్రతిభాశాలి.

అట్టిపుణ్యదంపతులకు జనించిన బాలిక సామాన్యురాలెట్లగును? ఆమె జననీజనకులనుండి సుగుణము లన్నియు పుణికిపుచ్చుకొన్నది. తండ్రికి వేట యన్నను, ఐశ్వర్యోపాసన మన్నను నధికోత్సాహము. తల్లికి అతిథిపూజయన్నను, ఆర్త రక్షణమన్నను ప్రీతిమెండు. ఇట్టివి కేవలము వారు పరమ ఛాందసులని పరిగణింపరాదు. ఆజననీజనకుల కాభిజాత్యసంపన్నములైన గౌరవమర్యాదలు మున్నగునవి స్వరూప్‌నకు బాల్యమునందే యలవడినవి. మోతీలాల్ మహాశయుని భాగ్యభోగ సంపన్నతను, సౌఖ్యపుంజమును బహిర్గతమొనర్చు విలువయైన మోటారుబండ్లు, గుఱ్ఱపుబగ్గీలు, రకరకముల జాతికుక్కలు,

ఇంకనెన్నెన్నో యనిర్వచనీయవస్తుజాల మాగృహస్థుని ప్రాంగణమున నలరారుచుండెడివి. అశ్వారోహణవిద్యయందు దారితేరిన నెహ్రూపండితుని వెలుపలిదొడ్డిలో విలువయింతయని నిరూపింపరాని శుభలక్షణలక్షితంబగు నశ్వరాజంబు లశ్వశాలలో నిండియుండెడివి. దేనికైనను వెట్టిపుట్టవలెనుగాని యడిగి కోరినంతనె మనసుండు ప్రాణునా !

ఇంక బాలబాలికలకు సుశిక్షణ నిచ్చుటలో నాదంపతులు శ్రద్ధవహించి యున్నవారనుట కీనాడు తత్ఫలంబను గోనివారి ప్రవర్తనవిశేషజ్ఞతయే చాటుచున్నది. పసితనమందు తలిదండ్రులు తమబిడ్డల కెట్టిగుణము లలవడజేతురో యవియే గదా జీవితాంతమువరకు సుస్థిరములై వారి వృద్ధక్షయములకును, కష్టసుఖములకును కట్టుగట్టలై బాటలు తీర్చియుండునవి.

---

## ౨

## విద్యాభ్యాసము

“ గుణమణియునితడుగు ప్రాయిప
యనెనో ధరణికి రవణముగ సమర్పినవిధి యా
గుణవంతుని వెసదునిమిన
గుణహీనునిగాగ నెన్నుకొనరే ధాతన్. ”

శ్రీమతివిజయలక్ష్మి బాల్యమునుండియు పెద్దలయెడ వినయవిధేయతలు చూపుటయు, విద్యయం దాసక్తి కలిగి యుండుటయు, నైతికాచారసంపత్తియం దపేక్షయు, సద్వర్తనమును నలవఱచుకొనినది. ఆమెకు విద్యాభ్యాసమునకు దగిన వయసురాగానే మోతీలాల్ నెహ్రూ తనగారాబుకూతురు విద్యావతియై యున్నందు దేశహితకాంక్షిణి కావలెనను నుద్దేశముతో గాబోలు నామెచదువుపట్ల నత్యంతశ్రద్ధాభురక్తిమును జూపెను. ఆమెకు అయిదుసంవత్సరముల వయసునందు మోతీలాల్ నెహ్రూ సకుటుంబముగ యూరపుదేశమునకు వెళ్ళ వలసివచ్చెను. ఆయన తనముద్దుకూతురగు విజయలక్ష్మికి పాశ్చాత్యభాషలందు ప్రవేశము గలిగింపవలెనని యుత్తమ వంశసంజాతయు, బోధనాపద్ధతియం దత్యంతనిపుణురాలును, విదుషీమణియు నైన, మిస్. హూపర్ ఆంగ్లవనితాశిరోమణి నుపాధ్యాయురాలిగ గుదిర్చెను. లక్ష్మి తనభావ్యోన్నత్యమును సూచించుభావనారేఖయోయన విరాజిల్లు నాయాంగ్ల యువతిచెంత వినయవిధేయతలతో విద్య నభ్యసించుచుండెను.

మనదేశమునం దేమి, కొన్నియితర దేశములందేమి నేటికి స్త్రీలు విద్యావంతులైనయెడల కొంపమునిగిపోవునను మూఢులును, ఆడువాండ్రు చదివి యేమిచేతురను పరమ ఛాందసులును, కారణము చెప్పకయే స్త్రీవిద్యయన్న నాకు దలనొప్పియను డాంబికులును, స్త్రీ విద్యావతియైన తప్పక

చెడిపోయితీరునను నవివేకులును గలరు. అది వట్టిబేలతనము, వెకిలితనము, పనికిమాలితనము ననుపించుకొనును. స్త్రీకి విద్య తప్పక యుండితీరవలెను. విద్యావతియైన స్త్రీ గృహ యజమానురాలైన నాగృహము సర్వసౌఖ్యములతో విరాజిల్లుచు సకలసంపత్సమృద్ధియై వన్నెదెచ్చుననుట కించుకేనియు సందేహము లేదు. అయితే స్త్రీ యెట్టివిద్య నేర్వవలెనను యంశమును నిర్ధారించుటయు కష్టము కానేరదు. ప్రతిస్త్రీయును గృహనిర్వహణమునకు బనికివచ్చు వ్రాతకోతలను, ఆరోగ్యదశను పెంపొందించు ప్రకృతిశాస్త్రమును, పాకశాస్త్రమును, శిశురక్షణము మున్నగు వివిధవిద్యలయందు పాల్గొని పేరుప్రతిష్ఠల నందుట న్యాయసమ్మతము, దైవసమ్మతముకూడను. విద్యావిహీనలయిన స్త్రీలను భార్యలుగా బడిసి పురుషులలో గొందఱు పొందు నవస్థలు వర్ణనాతీతములు.

విజయలక్ష్మి కేవలము అక్కరములను చదివి యాకళింపునకు దెచ్చుకొని నెమరువేయు, సాధారణవనితయా? కాదు. ఆమెకు నాట్యమున ననమానప్రీతి. అశ్వారోహణమన్న నమితోత్సాహము. చిన్నతనమందే గుఱ్ఱపుసవారి నేర్చెను. పాకశాస్త్రమును పారముముట్ట నేర్చెనదిట్టి. తాను చక్కనియభినివేశము గలిగి యెదుటవారి గోతుపాతులను గ్రహించి వాదించగలిగిన యప్రతిమానసాహసి. అవి యెల్ల రూపొందినపగిది చూపరులకు వెఱపుగొల్పుచుండును.

ఒకప్పుడు మిస్. హూపరువద్దకు ఈమె విద్యాభ్యాసము నకేగుట ♦ చూచిన మోతీలాలుగారికి యింటకు నొక జమీందారు తనన్యాయవాదితో, ఆర్యా! పురుషులవలె నీమెకుగూడ విద్య గఱపించుచున్నారా? స్త్రీలకు విద్య అత్యావశ్యకమా? విద్యవలన ధనార్జనయేకదా చేయునది? ధనార్జనను పెంపొందించు విద్యాభ్యాసము మీవంటియధిక ధనసంపన్నుల బిడ్డలకుగూడ అవశ్యకమని నేనూహింపను అనెను. అయితే అట్టిప్రశ్నలు తఱచుగా వేయుస్త్రీలు, పురుషులుగూడ అన్ని దేశములందును నింకను నున్నారు. అది ప్రపంచదురదృష్టముగాని వేఱుగాదు. ప్రతిగృహిణియు, విద్యావతియై యుండవలెననుట సత్యము. ప్రతిబాలికకు యేవయస్సున నేమేమి నేర్పింపవలెనో యట్టివి నేర్పించిన యట్టిగృహిణులు కేవలము సంతతిగనియెడి యంత్రములవలెగాక దేశములోను, తనయింటిలోను, పొరుగింటిలోను నెట్టివిపత్తులు వచ్చినను తొలగింపగల శక్తివంతులును, సాహసవతులును, ధీకుశలినులును నగుదురు.

విజయలక్ష్మి బాల్యమునుండియు నొకనియమబద్ధజీవిత సరణి కలవడెను. ఉదయమున లేచినవెంటనే యశ్వారోహణ మొనర్చి స్వారిచేయుట, పిదప కాలకృత్యములను దీర్చుకొని ఆటలు పాటలుయన్నిగు వినోదములలో పాల్గొని యటుపైని కొంతకాలము చదువునకు వినియోగించెడిది. ఆమె నాట్యమన్న చెవికోసికొనునది పదేనువత్సరముల వయసునం దొకనాడు

నాట్యముచేసి యందు వివిధములైన ప్రాచీనాధునికభంగిమలను జూపి యుపాధ్యాయురాలిని, తలిదండ్రులను ఆనందసముద్రమున నోలలాడించెను. అయితే యుపాధ్యాయురాలియాజ్ఞ జవదాటునది కాదు. మిస్. హూపరు సినీమాలు చూడవద్దని యాజ్ఞాపింప మానినది. తలిదండ్రులు బడికిపోక యింటివద్దనే చదువుకొనుచున్నంతనే తలిదండ్రులయాజ్ఞ శిరసావహించి పాఠశాలకు బోవుట మానినది.

ఆసమయమునకు మోతీలాల్ నెహ్రూ పేరుమోసిన దేశభక్తులు అనిపించుకొనుచుండెను. అంతేగాక ఒకవిధముగా కాంగ్రెసునాయకుడు కూడ నయ్యెను. జవహార్ పండితుడు ఇంగ్లాండునుండి మరలివచ్చి తండ్రితోబాటు అలహాబాదులో న్యాయవాదిగ పనిచేయుచుండెను కాని యప్పటి దేశపరిస్థితులను బట్టి యతనిమనసు జాతీయరంగమునకు ఉరకలు వేయుచున్నది. విజయలక్ష్మి వయసు అప్పటికి పదిహేనేండ్లు. అవి ప్రథమ ప్రపంచమహాసంగ్రామము నేడో రేపో యన్నట్లున్న గడ్డు రోజులు. జర్మన్ దేశీయులు యుద్ధశంఖారావమును పూరించిరి. బ్రిటనుగూడ పూరింపక తప్పదు. ఒకప్రక్క దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహోద్యమము ప్రారంభింపవలెనని అచ్చటివారూహాలు చేయుచున్నారు. ఆసమయమున లాయడ్జార్జి భారతదేశనాయకులకు బ్రతుకో చావో తేలవలసిన ఘోరసంగ్రామము సంప్రాప్తించినది. దుర్మత శిక్షణార్థము కత్తిగట్టి నిలచితిమి. ఇప్పుడు సామ్రాజ్యప్రతిష్టా పరిస్థితి మీచేతులలో నున్నది. గృహ

చ్ఛిద్రములను మానుడు. మీరు సాయపడిన పదునాల్గులోకములను నవలీల జయింపగలము. మిమ్ముల నూతగాగొని మేము రణక్షేత్రమునకు దూకి రాజ్యక్షేత్రమునకై ధర్మప్రతిష్ఠాసిద్ధాంతము చేయనుంటిమి. మీరు పూర్తిగా నీయుద్ధభారమును వహించిరేని యనంతరము మీమనోవాంఛ యీధర్మసేవానిరతియే సాధించునని తెలుపగా వారందరిది సత్యమని నమ్మి క్షేమము తప్పక సహాయ మొనరింతుమని మాటయిచ్చిరి.

అప్పుడు గాంధీమహాత్మునివంటి దేశనాయకుడుకూడ నామాటలను నమ్మి పలువిధములుగ ప్రజలను ప్రోత్సహించెను. కాని కొందరు నాయకులు ఈనాటి యుపకారమును మరునాడే మఱచునట్టి విశ్వాసఘాతుకులకు నమ్మవలదు. మనము సాయము చేయవద్దని వాదించిరి కాని మహాత్ముడట్టివారినిగూడ బలవంతపరచి పోకతప్పదని యుద్ధభూమికి ప్రభుత్వజాతిరక్షణార్థమై, అపారపారావారముగ ధనరాశియు, రణారంగణమున తీవ్రక్షాత్రతేజంబు నుజ్జ్వలింప జేయగల సైన్యసమూహమాయత్తమైనది. హైందవసేనల నిట్లు మూటకట్టి నిలబెట్ట మహమ్మదీయులకు టర్కీదేశము మమ్ము మోసముజేసి శత్రుపక్షమున జేరినది. అయినను భయములేదు. అచటి మీ మసీదులను కాపాడుభారము మావయినిబెట్టి పరాక్రాంతి నొనర్పగా వెనువెంటనే రండని యొప్పించి యిస్లాంసేనల నున్నంతవఱకు తెప్పించిరి.

ఆ సంగ్రామరంగమున దురికిన వీరస్త్రైనికనికాయము చూపిన దేశభక్తి, ప్రభుభక్తి యనిర్వాచ్యములు. తిరిగివప్పుడు వత్తురని తల్లులచేత పలుమారు లడిగించెడి క్రొత్తపెండ్లికూతుం డ్రను విడచియు, కొలదికాలముక్రిందటనే భర్తలతో పొత్తు గలుపుకొని మనసులు హత్తుకొని క్షణమైన విడుచ సహింపక కాపురములు సాగించు ననురాగపుటిల్లాండ్రు మేముకూడ వెంటవత్తుమని వదలకున్న నెట్లో వారిని సముదాయించియు, ప్రసవించినతరువాతనైనా పోగూడదాయని బ్రతిమాలు గర్భవతులైన భార్యలను మంచిమాటలతో సంతోషపెట్టియు, ముందునకు బోనీక కాళ్ళకడ్డుదగులు పసికందుల చేతులలో నింతమిఠాయిపెట్టి మఱపించియు హృదయమున గాఢమైన రాజభక్తి బాదుకొన పుత్రమిత్రాదులను, మాతృభూమినివిడచి భారతయోధులు భండనభూమి కత్యుత్సాహముతో ధుమికిరి.

ఈవిధముగా భారతధ్వజినీయోధులు నిజసామ్రాజ్య యశఃపతాకల కున్మేషంబుగా నేను ముందు, నేను ముందని ప్రభువులను బ్రార్థించి మహోత్సాహంబుతో జగద్విజ సంక్షోభంబగు సంగ్రామరంగమున దురికి రణవ్యాపారపారంగతులై, సర్వత్ర తామయై శత్రుసేనలు శతఘ్నికాచయము నుండి యుదగ్రకీలాసముత్కటగోళంబుల గుప్పించుచున్నను ఖడ్గమాత్రసహాయులై శౌర్యము రూపొందినట్లు శాత్రవసేనా సమూహమును చించిచెండాడిరి. ప్రతిరాష్ట్రంబుకూడ స్వప్రజా ప్రతినిధిత్వప్రాజ్యరాజ్యాంగపద్ధతికై పోరాడు సమయంబున

భారతీయులు స్వార్థత్యాగులై ప్రభువులకు వితతప్రాణ ధనంబులను తృణముగా వెచ్చించి కృతార్థీభూతసత్యవ్రతులై సామ్రాజ్యస్థితిని రక్షించిరి. అంత శాత్రవులు బంధుమిత్రాదు లందఱు టెంకనైన బుద్ధి కలిగి సమరయత్న ముడుగుమని నిరసింపగా దనయాశాలతాబంధములు విచ్ఛిన్నములు కాగా సంధిసంధియని విలపించుచు పాదాక్రాంతు డయ్యెను.

అదేమి దురదృష్టమోగాని, ఋణములు చేసికూడ యుద్ధసాహాయ్యార్థము ధనమిచ్చిన చేయితడి యారనేలేదు— ఆదారుణసంగ్రామయజ్ఞంబున ప్రాణసమూహాములను వ్రేల్చిన వీరయోధుల కళత్రాదిబాంధవుల కన్నులనుండి స్రవించు శోకజలప్రవాహ మింక నేలేదు. కృతఘ్నీభూతులును, గర్వాంధులునైన బ్రిటీష్‌ప్రభువులు, జగదుపద్రవమంతయు సంహరించి శాంతిధర్మములను స్థాపింతుమనియు, బలవంతులైన రాజులబారిబడకుండ అల్పరాష్ట్రీయులధనద్రవ్యముల నుద్ధరింతు మనియు, అసురధర్మంబైన యాయుధీయధర్మంబును నశింప జేసి మానవులందఱను సూత్రింతుమనియు, సమస్తజాతులకు కూడ నాత్మనిర్ణయసూత్రము వర్తించుత్రోవ ననుగ్రహింతు మనియు, యుద్ధమునకు ముందు ప్రకటించిన ధర్మవచనంబుల నన్నిటి నాచరణలో నరత మొందినవి. హైందవుల కిచ్చిన యభయప్రదానములు నీట గలిపి కారణము లేకుండగనే రౌలటుచట్టము నొక దానిని నిర్మించి పయోముఖవిషకుంభ

ములై భారతప్రజాకోటిని హింసించిరి. ఆరాజభక్తితత్పరతకు ఫలితముగ పంజాబు జలియన్‌వాలాబాగులో ఘోరదురంత సంతాపచర్యలు నడిపింపబడి వేలకొలదిప్రజ లాహుతులైరి.

---

# 3

## రాజకీయపరిసక్తి

"అతిదీనంబయి నీచదాస్యనిగళవ్యాబద్ధమై దుర్భర
స్థితిమై వాడి కృశించు దేశజనయిత్రీదుఃఖమున్ గాంచి, చి
క్కతను లాక్రందన మాచరింప వినరాదా మీకు గంపంత సం
తతి యున్నందుకు దాస్యమోచనమె లేదా యెందుకీ
జన్మముల్"

శ్రీమతి విజయలక్ష్మి జననీజనకులయాజ్ఞ ననుసరించి స్వగృహమందే విద్యావ్యాసంగమును సలుపుచుండెడిది. అప్పటికి జనకుడు మోతిలాల్‌పండితమహాశయుడు రాజకీయములందు పూర్తిగా పాల్గొనుచుండెను. అలహాబాదు నగరము కూడలిప్రదేశమగుట బహుజనస్థాయమానమై యొప్పారును. మోతీలాల్‌పండితుని సదనమునకు కాంగ్రెసుసభలకు పోవు వారును, వచ్చువారును విచ్చేసి ఆయనతో రాజకీయప్రసంగ

ములను సలుపుచుండువారు. అప్పటికే జవహర్‌లాల్ విదేశము లలో విద్య ముగించుకొని వచ్చి తండ్రితోబాటు న్యాయవాద వృత్తి నారంభించియు రాజకీయపరిస్థితులనుగూర్చి వివిధములైన యాలోచనలను సల్పుచుండువాడు. ఆతండ్రికొడుకులు తమయింటనిలచిన రాజకీయమిత్రబృందముతో సలుపు చర్చ లనన్నింటిని విజయలక్ష్మి వినుచుండుటయేగాక మధ్యమధ్య తానుగూడ నాయాచర్చలలో పాల్గొనుచుండెడిది.

తదుపరి యామె 1915 వ సంవత్సరమున బొంబాయిలో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసుకు తండ్రితోవచ్చి యచ్చటి కార్యకలాపములను, చర్చలను బహుశ్రద్ధతో నాలకించెను. తీర్మానముల నన్నింటిని బాగుగా నాకళింపునకు దెచ్చుకొనెను. ఇంతలో నామెకు కొంతకాలము చదువు చెప్పి యిప్పటికిని తమ యింటిలో పిల్లలకు చదువుచెప్పు మిస్. హూపర్ ఒక యాంగ్లేయుని ప్రేమించి పెండ్లాడుటకై యుద్యోగమును చాలించుకొని మరలినది. విజయలక్ష్మి యప్పటికే చాలవరకు రాజకీయవిజ్ఞాన విద్యాసంప్రదాయములను గూడ గ్రహింపగలిగెను. బొంబాయికాంగ్రెసునుండి మరలివచ్చినదిమొదలామెకు రాజకీయాంతు యధికముగా ప్రబలినది. ఈసమయముననే పూనాలో శ్రీబాలగంగాధరతిలక్ మహాశయుడు హోమ్‌రూలు లీగు స్థాపించెను. అప్పుడే బిసెంటుగారొకహోమ్‌రూలులీగు స్థాపించినది. ఈరెండును జాతీయస్వాతంత్ర్యతావేశమును ప్రజలలో నుద్బోధింప తీవ్రప్రచారమును సాగించినవి. వానిలో

జవహర్‌లాల్ సభ్యుడై పట్టుదలతో పనిచేయుచుండెను. ఈసమాచారములన్నియు విజయలక్ష్మి తనబుద్ధిచాకచక్యముచే నవగితె మొనర్చుకొనుచున్నది.

ఇట్టిపరిస్థితులలో విజయలక్ష్మి తన భావపరంపరను జాతీయ సేవకు ధారపోతామా అనే చర్చల్లో పెట్టింది. మోతీలాలుగా రప్పుడు అలహాబాదుహోమ్‌రూల్ లీగున కధ్యక్షుడుగానుండెను. కాని హిందూమహమ్మదీయులమధ్య సభ్యత్వమేర్పడి యుభయులు నిష్కల్మషబుద్ధితో కార్యక్రమమున నారెండు తెగలవారు పాల్గొనినగాని కాంగ్రెస్‌లో ఆయనకు ప్రవేశింప నిష్టములేదు. ఈసమయమున నే మోతీలాలుగారి యానంద భవనమున అఖిలభారతకాంగ్రెస్ కమిటీవారును, అఖిలభారతముస్లిమ్‌లీగు కమిటీవారును సమావేశమైరి. బ్రిటిషు ప్రభుత్వము యుద్ధానంతరమున భారతీయులకు బాధ్యతాయుత రాజ్యాంగము నిచ్చెదమని వాగ్దానమొనరించిరి. కాని దేశమున నిరంకుశపాలనమునే చేయగలిగిరి. ఇట్టిసమయంలో విజయలక్ష్మి తనరాజకీయజీవితమునకు పునాదులు వేసుకొనదొడగె.

ఏమైననేమి ? బ్రిటిషుప్రభువులు పయోముఖవిషకుంభములై, మేకవన్నెపులులై, ప్రతిదేశముయొక్క పరిపాలనాపద్ధతిని దేశీయుల యిష్టప్రకారమే జరిగించెదమని, స్వయం నిర్ణయసూత్రముపైనే రాజ్యాంగాన్ని నడుపుతామని యిచ్చిన వాగ్దానాలను భంగపఱచి దానికిమారుగా మాంటేగ్,

మింటోమార్లేసంస్కరణలను ప్రవేశపెట్టిరి. వానిలో అణుమాత్రం కూడా స్వాతంత్ర్యబీజాలు లేవు. దానితో జాతీయవాదులకు లకును, ప్రజాసామాన్యమునకును కూడ ఆశాభంగమైనది. ఆ సంవత్సరమునజరిగిన కాంగ్రెసుమహాసభలో ప్రభుత్వసంస్కరణ పద్ధతిని నిరసించుచు నాయకులు తీర్మానమొనర్చిరి. ఈ సంవత్స రాంతమున లక్నోలో రాష్ట్రీయకాంగ్రెస్ సభ జరిగినది దానికి మోతీలాల్ గారే యధ్యక్షులు. మితవాదు లాసభకు హాజరు కాక యాతనికి సంశయా మెక్కువయ్యెను. ఆసభలో దన యధ్యక్షోపన్యాసమును గంభీరముగా నిచ్చెను.

1918 సంవత్సరమునాటికి మోతీలాలు నెహ్రూగారు న్యాయవాదవృత్తిని పూర్తిగ విసర్జించి దేశసేవానిమగ్నులైరి. కాని అంతలో ప్రభుత్వమువారు తీవ్రవాదు నణచుటకు తీవ్ర శాసనములను గల్పించి పంజాబులో జలియన్ వాలాబాగ్ దురంతములును, చౌరాచౌరీ దురంతములను సాగించిరి. ఆ సమయముననే చీరాలపేరాల సమరముకూడ జరిగినది. మహాత్మాగాంధీగా రీరాతీవ్రశాసనముల నణచుటకు సత్యాగ్రహముతక్క రెండవసాధన నిరర్థకమని సత్యాగ్రహము చేయబూనెను. ఆసమయముననే నెహ్రూకుటుంబము వారికి గాంధీమహాత్మునితో అంగాంగిభావసంబంధ మేర్పడినది. జలి యన్ వాలాబాగ్ దురంతములను వినినదాది విజయలక్ష్మి మనస్సు కలగుండువడి దేశీయప్రజల దుర్దశకు చిత్తము త్రమిల్లి తనయారోగ్యసుఖములను, ఇతరవిజయములను గణింపక తన

జీవితము సంతను స్వరాజ్యసంపాదనకై ధారపోయు దీక్ష వహించినది. అద్భుతతిరదీక్షయే, అభ్యుదయమే నేడు భారతరాజకీయాకాశమున నామె నొకనక్షత్రమునుబోలె నుజ్వలింపజేయుచున్నది.

నెహ్రూకుటుంబమునకు మహాత్మాతో సంబంధము కలుగగానే యాకుటుంబములోనేగాక కాంగ్రెసుచరిత్రలోగూడ నొకక్రొత్తయధ్యాయ మేర్పడినది. అప్పటినుండి నెహ్రూకుటుంబమువారు రాజకీయములలో చురుకుగ ముందునకు దుముకుట కారంభించినారు. మహాత్మాజీ మోతీలాల్ నెహ్రూతో కొన్నిముఖ్యమైన రాజకీయవిషయములను చర్చింపదలచి అలహాబాదునకు వచ్చినారు. ఆయననోటినుండి వెలువడు పంజాబుదురంతకథనము విని మోతీలాలుమనస్సు విదారకమై బాణములవలె నాటినది. అంతియేగాక కుమారుడైన జవహర్లాల్నెహ్రూ రాజకీయరంగమున చేయునుద్ధృతకృషి వలన తండ్రికి రెట్టింపు ప్రోత్సాహము కలిగెను. ఆయన కోట్లకొలది ధనమార్జించెను. అమితముగ వ్యయించి భోగభాగ్యముల ననుభవించెను. న్యాయవాదవృత్తి విడచుటతోడనే తత్కుటుంబము దరిద్రము ననుభవింపవలసివచ్చి గుఱ్ఱములను, బగ్గీలను, విలువైన యితరసామగ్రులను విక్రయించినారు. మోతీలాల్ న్యాయవాదవృత్తిని విడనాడినపిమ్మట నొకనాడు ఒకక్లయింటువచ్చి న్యాయవాదశేఖరా ! మీరు వృత్తిని విడనాడినారని తెలిసియు మీకడకు వచ్చితిని. మీరు స్నేహితులుగా

నాయీాబిక్కు కేసులో పనిచేసినచో లక్షురూపాయల నిత్తునని ప్రతిపాలెను. అప్పుడు నెహ్రూగారు తనకుమార్తెతో బేటీ! ఇప్పుడు వారల కేసు వప్పుకొని పనిచేయుట మంచిపద్ధతేనా? అనియడుగ నామె కొంచెమాలోచించి ధైర్యము దెచ్చుకొని వద్దు నాన్నగారూ! మీారు కేసు వప్పుకొనవద్దు అనెను. అంత నెహ్రూగారు కుమార్తెను కౌగిలించుకొని. క్లయింటును నిరాకరించి పంపివేసెను.

1920 సంవత్సరములో మహాత్మాజీ ప్రభుత్వమువారు తమయధికారమును హెచ్చుచేయదలంచు నెట్టిపనులలోను వారి కేరీతిగను సాయముచేయరాదని, ఆవిధముగా జరుపు సంస్థలలో పాల్గొనరాదని. నిర్ణయించు సహాయనిరాకరణోద్యమము నారంభించిరి. అందు విజయలక్ష్మీపండిట్ తండ్రియు, సోదరుడును పాల్గొని దలంచుచుండిరి. ఆయేడు సెప్టెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసులో గాంధీగారు సత్యాగ్రహ తీర్మానమును ప్రవేశపెట్ట మోతీలాలుగారు బలపఱచిరి. నాగపూర్ కాంగ్రెసులో నాతీర్మానమే సభ్యులందఱిచే నామోదింపబడినది. వెంటనే మోతీలాల్, జవహార్‌లాలునెహ్రూ పండితు లిరువురు సత్యాగ్రహోద్యమమున పాల్గొని ప్రభుత్వమువారి యాగ్రహమునకు పాత్రులై నిర్బంధింపబడిరి. వారికుటుంబమంతయు వారు నడచిన మార్గముననే నడువ నిశ్చయించిరి. అప్పటినుండి అలహాబాదులోని ఆనందభవనముపైని దాడి చేయుట పోలీసుద్యోగస్థులకు పరిపాటయినది.

స్వల్పజరిమానాలవిషయములోగూడ విలువైన వస్తువులను సంగ్రహించికొనిపోవువారు. కొలదికాలములో తనకుటుంబములో జరిగిన యీ మార్పులను గమనించి యించుకంతైన ధైర్యమును వీడక, కలవరపాటుజెందక యత్యంతసాహసముతో పట్టుదలను, ధైర్యమును పెంపొందించుకొని దేశ స్వాతంత్ర్యము నకై తన తనుప్రాణములను ధారపోయ నిశ్చయించుకొనెను.

---

# 3

# ఆదర్శవివాహము - కుటుంబ నిర్బంధము

"లలితమైనట్టి లీల లీలావతులకు
సహజమది మూర్ఖునకు మది సందడించు
పద్మినికి రాగగరిమ స్వాభావికంబు
తేటి పనిలేక దానిలో దిరుగుచుండు"

1920 సంవత్సరాంతమున నొక సుదినమున సూర్యోదయకాలమున జాతీయభక్తబృందమున కధినేతయైన మహాదేవదేశాయి తనమిత్రుడగు మోతీలాల్ నెహ్రూగారి ఆనంద భవనమున నవతరించెను. ఆయనను జూచుటతోడనే విజయ

లక్ష్మి మహదానందమున స్వాగత మిచ్చి యాదరించి చనువున నాయనతో ప్రసంగించుచుండెను. అపుడు దేశాయిగారు తన చేతిలోనున్న మోడర్నివ్యూపత్రికను దీసి కొన్ని పుటలును తిరుగవైచుచు నందొక వ్యాసమును జూపి విజయలక్ష్మిని జదువ నియోగించెను. కొలదినిమిషములలో నామె యా వ్యాసమును జదివి ముగించి పత్రికను ముడచినది. ఆవ్యాసము పేరు 'గురుచరణ సన్నిధిని' అనుశీర్షిక గలది. రచయిత పండిట్ రంజిత్. దేశాయిరంజిత్ గార్లిరువు రొకే కళాశాలలో విద్య నభ్యసించిరి. దేశాయిగారు తనసతీర్థ్యుడును, మిత్రుడును నైన రంజిత్ గారిగుణగణములను విజయలక్ష్మియెదుట నెంతో శ్లాఘించెను. ఆపెద్దమనిషిమాటలవలన నామె రంజిత్ గారి సంగతిసందర్భములు నన్నిటిని తెలిసికొన్నది. అప్పటి నుండి రంజిత్ ను పతిగా బడయ దలంపుగొన్నది. విజయలక్ష్మి రంజిత్ లు మరిరెండుమాసములు దాటినపిదప నొకచో గలియుట తటస్థించెను.

వారిరువు రొకరి నొక రెరుకపరచుకొని పరస్పరప్రేమ భావములు హృదయసీమలందు నిలుపుకొనినవా రగుట యెర కురిక లేక మాటలాడుకొనిరి. ఆమె తనయందుచూపు నను రాగభావపంక్తిని గ్రహించిన రంజిత్ పండిట్ గారు 'నన్ను వివాహమాడ నీ కిష్టమేనా ? నేను చాలదూరమునుండి వచ్చి తిని. త్రోవలో నెన్నో వంతెనలను దాటితిని. కాని భవిష్య త్తులో మనమిరువురము చేయిచేయి గలుపుకొని మన వంతె

నలను దాటవలెను ' అని పల్కిరి. అంత నామె నునుసిగ్గుతో అల్లేయని ముక్తసరిగా జబాబిచ్చెను. ఏమైననేమి యాప్రేమికుల కిరువురకును 1921 మే నెల 10 వ తేదీని విజయలక్ష్మికి 21 వ యేట శాస్త్రీయపద్ధతిని వివాహ మతివైభవముగ జరిగెను.

ఆసమయమున దేశములో నశాంతి ప్రబలెను. అపుడు ప్రభుత్వమువారు ప్రజలలో రాజభక్తిని రేకెత్తింపదలచి వేల్సు యువరాజును భారతదేశమున కతివైభవముగ రప్పింప నేర్పాట్లు గావించిరి. ఆయన భారతదేశసంచారము చేయునట్లును, ప్రజలు స్వాగతోత్సవములను నడపుటకును కట్టుబాట్లు చేసిరి. కాని బ్రిటిష్‌సామ్రాజ్యపాలకులయెడలను, రాజ్యాంగపాలనావిధానమునను, ప్రజల కిష్టములేదని తెల్పి నిరసింప యువరాజు సంచారమును బహిష్కరింప కాంగ్రెసువారు యత్నించిరి. కాంగ్రెస్ వాలంటీరు దళములను ప్రోగుచేసి యాందోళనము సాగించి యువరాజసంచారోత్సవములలో ప్రజలను పాల్గొనకుండ నాదేశించెను. పిదప వాలంటీరుదళము లక్రమసంఘములని ప్రచురించిరి. నాయకులను చాలినంతవఱకు నిర్బంధించిరి. ఆదేతరుణమున మహాత్మాజీ శాసనధిక్కారమును జేయ సంకల్పించి పన్నులీయకుండ పూనుకొనెను. గాంధిగారినిగూడ ప్రభుత్వమువారు నిర్బంధములో నుంచిరి.

1925 సంవత్సరాంతమున జవహర్‌లాల్ నెహ్రూ భార్యయగు కమలానెహ్రూకు మిగుల జబ్బుచేసినందున నామెను

స్విట్జర్లండులోని శానిటోరియమునకు గొంపోవ వైద్యులు సలహానిచ్చిరి. 1926 మార్చిలో భార్యాతనూజులతో యూరపునకు పయనమయ్యెను. వారివెంట విజయలక్ష్మిరంజిత్ పండితులు బయలుదేరి యూరప్ఖండమంతయు సంచారము చేసిరి. అందువలన నామె యెంతో రాజకీయపరిజ్ఞానము నార్జించి స్వదేశమునకు భర్తృసహితముగా మరలి వచ్చెను.

కాలమునకు తీరిక యనునదిలేదుగదా? అంతలో రెండేండ్లు గడచినవి. 1928 సంవత్సరమున మోతీలాల్గారియాధిపత్యముక్ర కలకత్తాలో కాంగ్రెసుమహాసభ జరిగినది. 1931 డిశంబరున గాంధీగారు యింగ్లండుపోయి రౌండుటేబులు సమావేశములో పాలుగొని స్వదేశము చేరునప్పటి భారతదేశ రాజకీయపరిస్థితులు తలక్రిందులై యల్లకల్లోలముగా నున్నవి. గాంధీయిర్విన్ఒడంబడిక ప్రకారము డొమినియన్ రాజ్యాంగ మొసంగబడలేదు. మహాత్మాజీ స్వదేశములో అడుగుపెట్టగానే జవహర్లాల్ మొదలగువా రరెస్టు చేయబడిరని తెలిసినది. అణగగొట్టుటకు సాధ్యముకాని మహావిపత్తు, కాంగ్రెసును, దొరతనమును తలక్రిందులు చేయునట్లు దేశములో నుద్యమము ప్రారంభ మయ్యెను. దానికి కారకులు పరిపాలకులే. బానిసలుగా నుండజాలమనియు, స్వరాజ్య మొసగవలసినదనియు కోరినందులకు హిందువు లనేకులపై లాటీచార్జిలు చేయబడినవి. కొరడాదెబ్బలశిక్షలు విధింపబడినవి. చాలమంది నిర్బంధింపబడిరి. అప్పటిరాజప్రతినిధి కనికరము వీడి నిమిషమున

కొకచట్టమును తయారుచేసి భారతీయులను బాధలపాలు గావించుచుండెను. ఉప్పుసత్యాగ్రహోద్యమమును, ప్రపంచ మం దెచ్చటను లేని ఉప్పుపన్నువిధానమును తగ్గింప గాంధీగారు మొదలిడిరి. ఆయనను, పెక్కుమంది నాయకులను నిర్బంధించి కారాగారములనుంచిరి.

అప్పటిరాజకీయపరిస్థితులను, పరప్రభుత్వముపట్ల హిందువులకు గలిగిన ద్వేషభావములను వెలిబుచ్చుటకు విజయలక్ష్మి రోషపూరితహృదయయై రాజకీయరంగమున కురికి యుపన్యాసములు చేయుట, హర్తాలు జరిపించుట, ఊరేగింపులుత్సవముల నుత్సాహముగ తనయాధ్వర్యమున బయలుదేరదీసి నిర్వహించుట మున్నగు కార్యకలాపములు జరుపుచుండెను. ఇవియే ఆమెకు నిత్యకృత్యములయ్యెను. కాని యామె జరుపు రాజకీయాందోళనకు దొరతనము వెఱపుజెంది, నీవెచ్చటను నేడు మొదలు నెలదినములవరకు రాజకీయవిషయములలో జొరబడరాదు, అని విజయలక్ష్మిని వాక్స్వాతంత్ర్యనిరోధపుటాజ్ఞాపత్రమును బంపిరి. అది చూచి వీరనారీమణియగు విజయలక్ష్మి యించుకేనియు వెఱవక, మరెంత ఆగ్రహావేశపరవశయై దాని నుల్లంఘింప నిశ్చయించుకొనెను. విజ్ఞానవతియగు విజయలక్ష్మివంటి యువతి దొరతనమువారి చెప్పదంటు నవేదాజ్ఞకు తలయొగ్గి నాటిస్వాతంత్ర్యపోరాటములో పాల్గొనకుండ నుండగలదా ?

27—జనవరి 1932 వ తేదీని ప్రభుత్వమువారి నిషేధాజ్ఞను నిర్లక్ష్యముచేసి విజయలక్ష్మి తన సోదరీమణియగు కృష్ణతోగూడ తనదైనటువంటి రాజకీయకృత్యములను హార్తాల్ మున్నగువానిని జరిపించుట మానలేదు. అంత దొరతనమువారా సోదరీమణిద్వయముపై పోలీసువారు కేసు బనాయించిరి. అయితే పోలీసువారు పెట్టెడి కేసులలో నూటికి నూరువంతు అసత్యములని, అన్యాయములని వారు గాలి పోగుచేసి మేడలను గట్టుదురని కడుపుకక్కురితి యిట్టిపనులు చేయించునని భారతీయులలో దృఢవిశ్వాస మొందు వనాడో బాదుకొన్నది.

అందుచే నిజమైన యే దేశభక్తుడుగాని, ఏరాజకీయ నాయకుడుగాని యట్టినిషేదాజ్ఞలను లెక్కింపక మీదుమిక్కిలి యట్టివానికై నిరీక్షింపుచు నుల్లంఘింప నువ్విళులూరుచుందురు. విజయలక్ష్మియు, కృష్ణయు నిర్బంధింపబడి కారాగృహమున నుండిరేకాని వారిహృదయములు రాజకీయపుటాకాశవీధులలో సంచలించుచునే యున్నవి. వారిరువురిపైన కేసు ఋజువైనట్లు న్యాయమూర్తి చెప్పుచు ప్రతిఘటించుతలంపున్నదా యని యడుగ విజయలక్ష్మి ఈవిషయము అసత్యబద్ధము కావున మేము ప్రతివాదన చేయదలంపమని సమాధాన మిచ్చెను.

అంత న్యాయమూర్తి విజయలక్ష్మికి ఒకసంవత్సరము కఠినశిక్షయు, కొంతజరిమానాయు విధింపబడినది. కృష్ణకు

జరిమానా లేకుండ నొక్కయేడు మాత్రమే కఠినశిక్ష విధించిరి. ఆసంవత్సరము విజయలక్ష్మి తనరెండున్నర సంవత్సరముల వయసుగల చిన్నకుమార్తెనుగూడ విడచి మహానందముతో లక్నో కారాగారమున కరిగెను. అఖండైశ్వర్యమును, సౌఖ్యమును, భోగభాగ్యములను అనుభవించిన విజయలక్ష్మీపండిట్ తల్లిమాత్రమే తనకుటుంబమంతయు కారాగారమున మ్రగ్గుటకు విచారించుచు స్వగృహమున నుండిపోయెను. విధివిధానమును దప్పించుకొనుట కాబ్రహ్మకైన వశము కాదుగదా ?

---



# దేశసేవ - మంత్రిపదవి

"ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాసంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్."

ఈప్రాచీనమహత్తరసందేశము భారతీయులచే నుద్ఘోషింపబడి, భారతీయులచే నాచరింపబడి, భారతీయులకే యనుభవసాంప్రదాయమై యలరారినది. ఇది ఆధ్యాత్మిక

భౌతికపూర్వకము గాకపోయినను నైతికమై భారతీయుల సద్వర్తన నాకర్షించి వారివశమున నున్నదనుటలో నావంతయు సందేహింప నక్కరలేదు. ప్రాచీనకాలమునాటి భారతీయులు యథాతథగా దీని ననుష్ఠించి ప్రజ్ఞాన్వితులని ప్రఖ్యాతి నందిరి. మధ్యమకాలమునాటి భారతీయులును ననుష్ఠింపకపోలేదు. ఈనాటిభారతీయులలో జాలమందియు నాచరించుచున్నారు. దానికి నేటిజాతీయనాయకులలో నగ్రగణ్యులందఱును, జాతీయ దేశసేవికలలో గొందఱును సాక్షీభూతులుగ నున్నారు.

1932 లో దేశమంతటను సత్యాగ్రహోద్యమ ముద్వోత్తుగ ఝంఝూమారుతమువలె నొక్కమారు చెలరేగినది. ప్రభుత్వమువారిచే సైనికశాసనములు, నిరంకుశశాసనములు, విపరీతచట్టములు వివిధములుగా నుపయోగింపబడి భారతీయ జాతీయజీవనముల నల్లకల్లోల మొనర్చినవి. అపుడు శాసనముల నన్నింటి నుల్లంఘింప నుద్యమించి కాంగ్రెసునాయకులు, వాలంటీర్లు వేలకొలదిగ కారాగారముల కేగిరి. దొరతనము వారి చట్టముల నమలుబాటుతో నిరోధములు హెచ్చినవి. కాంగ్రెసుసొత్తులను, కాంగ్రెసుభవనములను దొరతనమువా రన్యాయముగ, అక్రమముగ వశపఱచుకొనిరి. అనేకమంది జాతీయనాయకుల ఆస్తిపాస్తులను జప్తుచేసిరి. కాంగ్రెసు వాలంటీర్లమీదనేగాక ముదుకగుడ్డ కట్టినవారందరును లాఠీ చార్జీలకు గురియైరి. నూతనరాజ్యాంగమువైపు కాంగ్రెసు వారు మితవాదులు దృష్టి మరల్చిరి. ప్రజలకు దానివలన

రవంతయయిన ప్రయోజనముగాని, దానియం దధికారము గాని లేకపోయెను.

ఈసమయముననే హిందూమహమ్మదీయులమధ్య భేదభావములు పొడసూపినవి. దానితో సత్యాగ్రహము చల్లబడినది. దొరతనమువారి నూతనరాజ్యాంగ ప్రణాళికలో హిందూమహమ్మదీయులకేగాక హిందువులలో ప్రత్యేకముగా గొన్ని తెగలవారికి శాసనసభలో విభేదములు కల్పింపబడినవి. అస్పృశ్యులగు హరిజనులకు నియమితంబులగు స్థానములలో హరిజనులనేగాని హిందువులలోని యితరులను నియమింపగూడదని యేర్పాటుచేసిరి. వారిని హిందూసంఘమునుండి రేపి వేఱుచేసిరి. కాంగ్రెసునాయకులును, హరిజననాయకులైన ఎం. సి రాజా మున్నగువారునుకూడ హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గము కూడదని, సమిష్టివర్గమే యుండవలెనని పట్టుబట్టిరి. కాని దొరతనమువారు హిందువు లంత రంగీకరించిన మార్పుచేసెద మనిరి. హిందువులలోనున్న ప్రధానలోపమగు నైకమత్యాభావమే యడ్డు తగిలినది.

అప్పుడు గాంధీమహాత్ముడీవిధానము భారతజాతీయతకే ముప్పు దెచ్చునని గ్రహించి యైకమత్యమును గలిగింప నిరశనవ్రత మారభించెను. దానివలన దేశమున గొప్పసంచలనము కలిగినది. ఇది యేమార్గమునకు వంకరగా తిరుగునోయని నాయకులందరు పూనాలో నొకసమావేశము జరిపి యం

10

దొరయొడంబడిక గావించుకొని యాసమస్య నెట్లో పరిష్క-రించిరి. ఆయొడంబడిక ననుసరించి హరిజనుల యంటరాని తనమును దూరముగా గెంటుటకు వారిని దేవాలయములలో ప్రవేశపెట్ట నాయకులు తీర్మానించిరి. ఇందులకు హిందువుల లోని కొన్ని తెగలవారు సవర్ణులమైన మే మంగీకరింపజాలమని మంకుపట్టు పట్టిరి. ఇదంతయు నాయకులలోపమని మహాత్ముడు మరల 21 దినము లుపవాసదీక్ష పట్టెను. దేశీయుల యాందోళనము తీవ్రరూపము దాల్చినది దొరతనమువారు భీతచిత్తులై మహాత్ముని కారాగారమునుండి విడుదల చేసిరి. ఆయన ప్రతిక్షణము హరిజనాభ్యుదయమునకై దీక్షతో పనిచేయ సాగెను.

1932 వ సంవత్సరములో అలహాబాదులోని ముఖ్య నాయకు లందరు నసహాయోద్యమములో పాల్గొని కారాగారముల నలంకరించిన సమయములో విజయలక్ష్మీపండిట్ మహిళామండలితరఫున నాయకత్వము వహించి దేశస్వాతంత్ర్య సమరమున స్త్రీలకర్తవ్యమును గూర్చి యుద్బోధించుచు నాలకించినవారినెల్ల నాశ్చర్యసాగరమున ముంచిన ధైర్యసాహసోపేతమైన తనప్రథమోపన్యాసమును గావించెను. అప్పటి నుండి యనుదినము నెచ్చటనో యొకప్రదేశమున దనయుపన్యాస ప్రణాళికను సాగించుచు గొప్పప్రచారమును గావించినది. ఆమె వక్తృత్వవిశాలచాతుర్యము దేశీయుల నాకర్షించి పలు తావులనుండి యామె యుపన్యాసమును వినగోరి పంపెడి యాహ్వానములు కుప్పలుతిప్పలుగా వచ్చుచుండెడివి.

విజయలక్ష్మి కేవల ముపన్యాసము లిచ్చుటతోడనే తృప్తినహింపక రాజకీయసమస్యల నుద్దేశించు వివిధప్రణాళికల లోను బని కల్పించుకొని యహోరాత్రిము లేకదీక్షతో పని చేయసాగినది. ఆమె రాజకీయవాతావరణమున నక్కడి కిక్కడికి సంచరించు విద్యార్థులతో కలిసి మెలిసి తిరుగుచు వారితో తరచుగా రాజకీయసమస్యలను చర్చింపుచుండెడిది. ఆచర్చలు జరుపు సమయములం దామె ప్రదర్శించు నుద్వేగ మునకును, ఉబలాటమునకును, సాహసచర్యలకును దేశీయులు విభ్రాంతు లగువారు. ఒకనాడు మాంచెస్టరు జ్ఞాపకార్థము విద్యార్థిసంఘమువా రొకమహాసభను సమావేశపంచి, ఆ సభ కెందరనో విజ్ఞానవంతులైన రాజకీయవేత్తల నుపన్యాసకులుగా రావించిరి. వారితోబాటు విజయలక్ష్మినికూడ సగౌరవముగ నాహ్వానించిరి. ఆసభలో పలువురు రాజకీయవిజ్ఞానధను లొకరిని మించి వేరొకరు కన్నులకు గట్టినట్లు వాగమృతధారల నొలికించుచు నుపన్యసించిరి. అందువలన ప్రేక్షకులలో నేయొక్కరును సభాస్థానమునుండి కదలలేక నిశ్చేష్టులై చెవి యొగ్గి వినుచుండిరి.

ఆసమయమున విజయలక్ష్మి మానససాగరమున నుత్సాహతరంగములు పెల్లుబికి తానుగూడ నుపన్యసింప నుద్దేశించి సభాధ్యక్షు ననుమతికై వేడెను. ఆమె నోరు సాచి యడిగినదే తడవుగ నధ్యక్షు డనుమతి నొసంగ నామె మహోద్వేగముతో

నుపన్యాసవేదికపై ప్రత్యక్షమయ్యెను. తోడనే ప్రేక్షకు లోకించుకనేపు కరతాళధ్వను లొనర్చి యామెనోటినుండి ఏమి వినవచ్చునోయని నిశ్శబ్దముగ నుండిరి. అప్పు డామె గోర్కి యొక్క సందేశమును సింహాగర్జనము నేయుచు నాగోర్కియే నేడు విజయలక్ష్మీరూపముతో వచ్చి మనయెదుట నిలువబడి సందేశ మిచ్చుచుండెనా యనునట్లు వివరణముతో సవిమర్శ ముగ తేటతెల్లముగ బ్రహ్మాండమగు తనవాక్చాతుర్యమును జూపి యుపన్యసించి ప్రేక్షకుల నాహా యనిపించెను.

అప్పటినుండి యామె యేతావున నుపన్యసించునని కరపత్రములు వినబడినను జనులు తామరతంపరవలె నిసుకవైచిన రాలనట్లు గుమిగూడు వారు. ఆమె యిట్టిప్రచారముతో తనివి నొందక కాంగ్రెసునాయకుల యాదేశానుసారము స్థానికసంస్థలలో ప్రవేశించి పనిచేయవలెనని సంకల్పించియుండెను. 1935 సంవత్సరములో అలహాబాదు పురపారిశుద్ధ్యసంఘ (మ్యునిసిపాలిటీ) సభ్యురాలిగ నొకగొప్పధనికురాలితో పోటీ సల్పి యత్యధికసంఖ్యాకములగు వోట్లతో విజయమందెను. ఆ సమయముననే అలహాబాదులోని విద్యాసంఘ (Education Committee) మున సభ్యురాలై యాసంఘసభ్యులచే నేకగ్రీవముగ నధ్యక్షురాలిగా నెన్నుకొనబడినది. ఆపదవియం దామె పదునెనిమిది మాసములు పనిచేసి విద్యావిషయమైన యనుభవమును గొంత సంపాదించుట గాక యాసంఘమునందలి లోపములను గొన్నిటిని సవరించి, కొన్ని కట్టుబాట్ల నేర్పరచి, జాతీయవిద్యావిధానమునకు పునాదులను నాటినది.

ఇట్టిశుభ సమయమున నెహ్రూకుటుంబమువారి కొక యనిర్వచనీయమగు నాపద తటస్థించెను. కొంతకాలమునుండి జవహార్ పండితుని యిల్లాలగు శ్రీమతి కమలానెహ్రూ తీవ్ర వ్యాధిచే బాధపడుచుండెను. ఆమె ప్రకృతిసిద్ధముగ దుర్బలురాలు. తనశక్తికి మించినపని నెల్లప్పుడు చేయుచుండుననిః ఆ విధముగ వ్యాధిపీడితయయ్యు పతిదేవున కన్నివిధముల సహాయపడుచు, వలసినప్పుడు సలహా లిచ్చుచు మహిళా మండలిలో దేశభక్తిని నెలకొల్ప ప్రచారము చేయుచు నాడు వాండ్రకు జాతీయకార్యక్రమమును నేర్చి సత్యాగ్రహసమయములందు స్త్రీవాలంటీర్లతో విదేశవస్త్రముల నమ్ము దుకాణములవద్ద పికటింగ్ చేయుచు చేయించుచు తలపెట్టిన ప్రతి యుద్యమమునందును విజయము నొందెడిది. ఈతీవ్రకార్యకలాపమువలన నారోగ్యము చెడి క్రమముగా వ్యాధి బలమయ్యెను. అపు డామెను ముద్దుబిడ్డతోగూడ స్విట్జర్లండు తీసికొనిపోబడెను. భర్త నిరంతరకారాగారవాసుడై పలుకష్టముల నందుచుండుట కామె గుందుచుండ సతియనారోగ్యదశ కతడు దురపిల్లువాడు. రెండు మూడుపర్యాయములు కారాగారమునుండి వచ్చి భార్యక్షేమ మరసి మరల బందీ కేగెడువాడు. అదెట్టి దొంగరోగమోగాని తగ్గినట్టుగనే కన్పించుచు 1936 ఫిబ్రవరి 28 వ తేదీని కమలానెహ్రూను తనపొట్ట బెట్టుకొన్నది. ఎట్టివారికిని విధి యనుల్లంఘనీయముకదా!

పిదప విజయలక్ష్మి రెండుసంవత్సరముల కాలము కేవలము దేశసేవా ప్రచారమునందే నిమగ్నయై జాతీయజీవితా దర్శములను ప్రజల కుద్బోధించుచు గడపెను. అంతలో 1937 వ సంవత్సరమున సంయుక్తరాష్ట్రములందు అస్సెంబ్లీ ఎన్నికలు ప్రారంభమైనవి. అందు తప్పక ప్రవేశించవలసినదని పలువు రామెను హెచ్చరించిరి. అగోడవలలో బడిపోయిన తాను చేసెడి కాంగ్రెస్ కార్యకలాపములు సంకుచితము లగునేమోయని కొంతపరిశీలించి యిదివరకున్న స్థానికసంస్థలలోని యనుభవమునుబట్టి యిందుగూడ ప్రవేశించినచో తనరాష్ట్ర ప్రజలకు గొంతసేవగలుగుచునుగదాయని అస్సెంబ్లీలో ప్రవేశింప నిశ్చయించుకొనెను. యు. పి. రాష్ట్రముల అస్సెంబ్లీ సంఘములో మహిళలకై యొకస్థానము ప్రత్యేకింపబడెను.

ఆస్థానమునకప్పటికే యు. పి. రాష్ట్రవిద్యాశాఖామంత్రి గారి భార్యయైన శ్రీవత్సవ యనువిద్యావతి నామినేషను దాఖలు చేయుటయు నది యంగీకరించుటయు జరిగెను. అప్పుడు విజయలక్ష్మి యామెకు పోటీగా దాఖలుచేసిన నామినేషనుపత్రముగూడ సమ్మతించిరి. ఆయిరువురకును సమానమైన పోటి జరిగినది. అందు విజయలక్ష్మి యత్యధికసంఖ్యాకములగు వోట్లతో విజయ మందెను. అయితే ఆమె పోటీ చేయగానే దేశమందంతటను కాంగ్రెసువారు ప్రచారము చేసిరి. గాంధీసేవకు లాహారనిద్రాదులను మాని కృషి సల్పిరి.

అన్ని ప్రాంతములలోను కాంగ్రెసుపక్షమువారికే బ్రహ్మాండ మైన విజయము లభించినది. అందు విజయలక్ష్మి శ్రీవత్సవ వంటి పలుకుబడిగలనారీమణితో పోటీచేసి పదివేలవోట్లమెజా రిటీతో విజయ మందుట మిగుల శ్లాఘనీయము. ఆమె అసెంబ్లీలో ప్రవేశించిన పిమ్మట నొకసమావేశములో సి. రాజ గోపాలాచారిగారిచే ప్రతిపాదింపబడిన యొకతీర్మానము నెదిరించి తనకు జాతీయభావములందుగల సంపూర్ణాభిమానమును వెల్లడించెను. కాని యది త్రోసిపుచ్చబడెను. రాజగోపాలాచారిగారివంటి రాజకీయవేత్తయొక్క తీర్మానము నెదిరించి తీవ్రవాదమును సలుపుటన్న సామాన్యవిషయము కాదు. ఆమెయెదిరింపు త్రోసిపుచ్చబడినను నందలివిషయవిమర్శనానై పుణికిని, సునిశితమేధాసంపత్తికిని సభ్యులెల్లరు వెఱగందిరి. ఆచారిగారు గుండెపై చేతులుంచుకొనిరి?

ఇంతలో నొకదినమున అనగా 1937 వ సంవత్సరం జులై నెలలో సూర్యోదయమున యు. పి. రాష్ట్రప్రధానమంత్రి యైన శ్రీ గోవిందవల్లభపంతుగారివద్దనుండి యొకతంతివార్త వచ్చినది. అందలి శుభసూచకవిషయమేమన "మీరు మంత్రిపదవులలో నొకదానిని స్వీకరించి మాతో గలసి పని చేయుట కంగీకరింతురా" యని. కాని రాజగోపాలాచారి గారి తీర్మానము నెదిరించినపుడు దానిని త్రోసివేయుటచేత మంత్రివర్గమున బ్రవేశించుట కామె యిష్టపడక పంతుగారి

యాహ్వానమును నిరాకరించెను. అయినను మంత్రివర్గములో నామె యుండితీరవలెనను పట్టుదలయు, ఉత్సాహముకల యామెముఖ్యస్నేహితులలో గొందఱు విజయలక్ష్మిని దర్శించి, రాజగోపాలాచారిగారితీర్మానము సరియైనదనియు, కాంగ్రెసు సభ్యులలో పెద్దలయినవారు ప్రతిపాదించిన తీర్మానములను మనము శిరసా వహింపవలెననియు, తాము ప్రతిపాదన నెదిరించితి మది నెగ్గలేదను స్వల్పకారణమును మనసులో నుంచుకొని పంతుగారియాహ్వానమును త్రోసివుచ్చక మంత్రిపదవిని స్వీకరింపవలెననియు నామెకు నచ్చజెప్పిరి.

విజయలక్ష్మి తనకు స్నేహితు లుపదేశించిన వాక్యము లన్నియు సత్యములేయని విశ్వసించియు, మిత్రులందఱ కోర్కెను నిరాకరించుట మూఢత్వమగునేమోయనియు వారి యిష్టానుసారమే వర్తింతునని మాట యిచ్చెను. ఈవర్తమానము నాలించిన పంతుగా రమితానందమగ్నులైరి. ఆమె యిచ్చిన వాగ్దానము ననుసరించి 18 జూలై 1937 సంవత్సరములో సివిల్ సెక్రటేరియట్ ఆఫీసునకు బోయి పెద్దల యాశీస్సులనంది మంత్రిపదవి నంగీకరించి మహోత్సాహముతో ప్రమాణమును స్వీకరించెను. ఆమెకు పరిహద్దురాష్ట్రములోని యారోగ్యరక్షణశాఖపై సర్వాధికారముల నొసంగినారు.

అంత నామె తన కిచ్చిన యారోగ్యరక్షణశాఖయందలి పరిస్థితులను గమనింప రాష్ట్రమంతయు సంచారము చేసి

యవ్వాటిస్థితిగతుల నవగతము గావించుకొనెను. సంచారా నంతరము ప్రస్తుత మారోగ్యశాఖలోని కొన్నిలోపములు నవ రించి ప్రజలకు వైద్యసహాయము తక్కువగా నున్నదని యను భవమువలన దెలిసికొని యాసమస్యను పరిష్కరింపనెంచి యొక యారోగ్యప్రణాళికను దయారుచేసెను. అందు ప్రస్తు తము పల్లెటిగ్రామములలో వైద్యసహాయము ముఖ్యముగా చేసితీరవలెనుగాన 300 గ్రామములలో వైద్యశాలలు స్థాపించ వలెననియు, ఆవైద్యశాలలలో దేశీయపద్ధతిగ చికిత్సా సూత్రముల ననులువఱచి. 200 వైద్యశాలలలో హిందువులనే వైద్యులుగా నియమించవలెననియు, శేషించిన 100 వైద్య శాలలలోను ఆంగ్లవైద్యచికిత్సాపద్ధతులనే అవలంబింపవలె ననియు వివరించి యెస్సెంబ్లీకౌన్సిలుసమక్షమున నుంచెను.

కాని కొంద ఱవివేకు లామెప్రణాళికపట్ల పక్షపాతము వహించి కుతంత్రము లొనర్చుటవలనను, మొదటనున్న యామె పట్టుదల క్రమముగా తగ్గుటచేతను నామె తయారొనర్చిన ప్రణాళికపద్ధతి యమలుకరుగలేదు. అయితే మంత్రివర్గము వారు దానిని పురస్కరించుకొని వైద్యశాఖలో కొన్ని మార్పులను తెచ్చిరి. ఆగ్రాలోనున్న మహిళావైద్యపాఠ శాలను నర్సింగ్ సెంటరుగా మార్చిరి. రాష్ట్రములో మలేరియా నివారణకై రు 80,000 లు ఖర్చుపెట్టుటకు నిర్ణయింపబడి నది. మఱియు సర్వకాలసర్వావస్థలందు నీరు వలసినంత లభింపని తావులందు పుష్కలముగా త్రాగుటకు నీరు లభించు

టకుగాను నూతులను త్రవ్వుటకు రు 35,000 లు మంజూరు చేసినారు. 1938—1939 సంవత్సరములలో ఆటస్థలముల కొఱకును, వ్యాయామశాలలు తెఱచుటకును రు 45,000 లు శాంక్షను చేయబడినది.

ఆసంవత్సరములలోనే బొత్తిగా పల్లెటిగ్రామము లను కుంచుకొని తావులలో నుండుప్రజలకు వైద్యసహాయము నిమిత్తము మంజూరుకాబడిన ధనముతో స్థిరముగా నుండు నేర్పాట్లుగల యౌషధశాలలు 48 న్ని సమయానుకూలముగ నెచటకు వలసిన నచ్చటకు మార్చుకొనుట కవకాశము కల్పింపబడిన 16 ఔషధశాలలును, ప్రసూతికావ్యవస్థగోనేగాక యితరసమయములందుగూడ మాతాశిశువులను రక్షించు నేర్పాట్లుగల శిశురక్షణవైద్యశాలలు 24 న్ను, అందందు మరియితరవిధములుగా 192 ఔషధశాలలును స్థాపింపబడినవి. ఈమె మంత్రివర్గములో చేరియున్నపుడు ప్రజారోగ్యరక్షణ, స్త్రీసంరక్షణ, శిశుసంరక్షణ చేయ సమర్థములైన యౌషధశాలలు కట్టించుటలో చేసిన నామెప్రయత్నములు సఫలమైనవి.

ఆమంత్రిపదవియం దున్నకాలములో ప్రజలు తనకు కానుకలుగా నిచ్చిన ధనమంతయు ప్రజాక్షేమమునకై వెచ్చించెను. తనగారాబుకూతురగు విజయలక్ష్మి అస్సెంబ్లీ హాలులో ప్రమాణము చేసి మంత్రిపదవిని స్వీకరించు సమయమునకు మోతిలాలునెహూౄ అస్సెంబ్లీకి పోటీగా స్వరాజ్య

పక్షమునకు నాయకుడుగానుండి నడుపుచుండెడివాడు. మంత్రి పదవిని స్వీకరించిన పిమ్మట నామె యొకమారు అస్సెంబ్లీలో నుపన్యాసము చేయవలసివచ్చినది. అయితే ఆమె కుపన్యాసము లోని మెళుకువ లిదివఱకే బాగుగా తెలుసును. కాని యిది కేవలము రాజకీయపక్షమున రాజకీయములందనుభవముగల నాయకులయెదుట మాట్లాడవలసిన తరుణము. అందులోను ఎస్సెంబ్లీలో ప్రత్యేకోపన్యాసం చెయ్యడాని కిదే తొలిసారి.

అసలు ఆనాడు ఈ ఉపన్యాసం చెయ్యవలసిన బాధ్యత ప్రధానమంత్రిది. ప్రధానమంత్రికి హఠాత్తుగా అనారోగ్య మయినకారణంచేత నాయన మంచానబడి లేవలేనిస్థితిలో ఉండటంచేత ఆధారము విజయలక్ష్మిపై బడినది. ఉపన్యాస విషయము కేవలము రాజకీయప్రవక్తితో సంబంధము కలది. 1935 లో యిండియాప్రభుత్వమువారిచే తయారుచేయబడిన చట్టమును తీసివేసి అస్సెంబ్లీసభ్యులు తయారుచేసిన నూతన చట్టమును అంగీకరించి అమలుజరుపవలసినదిగా కోరుట.

విజయలక్ష్మి కించిత్తయినా జంకకుండా గొప్పధైర్యోత్సాహంతో ప్రధానమంత్రికి ప్రతినిధిగా నుపన్యాసవేదికపై నెక్కి గంభీరస్వరముతో "1935 లో ప్రవేశపెట్టబడిన గవర్నమెంట్ ఆఫ్ యిండియాచట్టమును మాదేశమునందలి ప్రజ లెవ్వరును అంగీకరించుటలేదు. అంగీకరింపరు. అంగీకరింప కూడదుకూడాను. అందుచే నాచట్టమును వెంటనే రద్దుపఱచి

దేశస్వాతంత్ర్యేచ్ఛకై ఎస్సెంబ్లీసభ్యులు నూతనముగా సిద్ధపఱచియుంచిన చట్టమును దేశంలో అమలుజరుపవలసినదిగా ఎస్సెంబ్లీసభ వారు తీర్మానించుచున్నారు.” అని మేఘనిస్వన ధ్వనితో గర్జించెను. ఆమె తీర్మానము నుపపాదించెను.

ఆసమయమున మహమ్మద్ యిస్మాయిల్ ఖాను లేచి ఆతీర్మానమును మార్పుచేయవలెననియు, అస్సెంబ్లీవారు సిద్ధపఱచిన తీర్మానమును ముస్లిమ్‌లుకూడ అంగీకరింపవలెనన్, ముస్లిముల రాజకీయమతహక్కులలో మార్పులు తీసికొని వచ్చుటకు 100 కి 75 ముస్లిములు అంగీకరించినగాని చట్టముగా చేయుటకు ఎస్సెంబ్లీకి అధికారము లేదనియు తీర్మానము నెదిరించెను. అందుపై విజయలక్ష్మి మరల మేఘగంభీరఘోషభీషణస్వనముతో కాంగ్రెసు మంత్రులయొక్క ప్రధానోద్దేశము భారతీయుల క్షేమమును, రక్షణను పెంపొందించు టేయనియు, ప్రజారోగ్యముకొఱకై ప్రతిజిల్లాలోను ప్రతిపల్లెయందును పూర్తియైన కట్టుదిట్టములు, ఏర్పాట్లు గావించుటేయనియు, వైద్యసహాయము ప్రజాకోటికంతకు తృప్తికరముగా జరుగుచున్నది లేనిది పరిశీలన చేసి కట్టుదిట్టములు చేయుటయే వారికర్తవ్యమును, ఆశయము ననియు నొక్కి చెప్పెను.

సభామధ్యమునుండి యొకరు “అంటరానివారివిషయమునుగూర్చి కాంగ్రెస్ మంత్రులేమిచేసిరి ?” అని ప్రశ్నింపగా

నామె తెలుకుబెలుకు లేకుండ, నాయనా! కాంగ్రెస్ నిఘంటు వులో అంటరానితనము అనుపదమే లేదు. కాంగ్రెసువారు అందరిని సమానముగానే చూచెదరని ప్రత్యుత్తర మిచ్చెను. ఆసమయముననే ప్రభుత్వమువారివద్దనుండి ప్రధానిమంత్రి గోవిందవల్లభపంతుకు ఒకలేఖవచ్చినది. రెండవప్రపంచయుద్ధ రేఖలు చూచాయగా పొడసూపినవి. అందుచే పంతుగారికి ప్రభుత్వమువారు యుద్ధములో పాల్గొనుమనియు, స్వరాజ్య మిచ్చెదమనియు వర్తమానించెను. దానిపై ప్రధాని విజయ లక్ష్మితో సలహా చేయకుండగనే ప్రభుత్వమువారికి, మాదేశ స్థులు యుద్ధములో పాల్గొనుటకు మేమెట్టి అభ్యంతరమును జెప్పముకాని ప్రభుత్వమువారు మేము బానిసలుగా నున్నందున మాయభిప్రాయమును, సలహాలను కోరలేదని చెప్పిరి.

విజయలక్ష్మి కీసంగతిని దెలిసినవెంటనే ప్రజల కందఱకు నొకపత్రికటన చేయుచు నందు, అన్నిమతముల వారును తమతమభిన్నాభిప్రాయములను విడనాడి యేకము కావలెననియు, స్వాతంత్ర్యసంపాదనకై మూలాధారమైన ఐకమత్యముతో పాటుపడవలెననియు, క్రియాశూన్యములును, ఫలరహితములునైన బ్రిటను వాగ్దానములకు సంతోషపడుంద నక్కరలేదనియు, యిదివరలోవలె బోనులోపడరాదనియు జెప్పెను. ఇంక ప్రభుత్వమువారికి, మేమందరము ఐకమత్యము గనే నిలచినామని, మాయైకమత్యమును మీరు లక్ష్యము చేయనెంచిరేని వెంటనే సంపూర్ణస్వాతంత్ర్య మియ్యవలెనని,

న్యాయమైన మాచిరకాలవాంఛను నిరాకరించుచో హిందూ దేశములో స్వాతంత్ర్యపోరాటము చెలరేగుననియు నుద్ఘాటించుచు సవాలుచేసెను.

శ్రీమతి విజయపండిట్ లెజిస్లేటివ్ ఎస్సంబ్లీలో సీక్రింద వివరించిన బిల్లులు (చట్టములు) ఆయాసంవత్సరములలో ప్రవేశపెట్టెను. వానిపట్టిక యిది.

(1) సంయుక్తపరగణాల మ్యునిసిపాలిటీలసవరణచట్టము—1939
(2) సంయుక్తపరగణాల డిస్ట్రిక్ బోర్డుసవరణచట్టము—1939.
(3) సంయుక్తపరగణాల ఆయుర్వేదవైద్యచట్టము—1939.

ఆమె మంత్రిపదవిలో నున్నపుడు మరల యూరపు దేశమునకు వెళ్ళుట తటస్థించెను. ఆసమయముననే మ్యూనిచ్ ఒడంబడికచర్చలు ముగిసి సంప్రతింపులు సమాప్తమై సంతికాలు జరుగుచున్నవి. అప్పటికి విజయలక్ష్మి లండను చేరుకొనెను. అచట నేమో కార్యకలాపములను దీర్ప యత్నించుచుండగనే ద్వితీయప్రపంచమహాసంగ్రామ మత్యంతభీభత్సమారణాయుధ కదంబములతో వలుప్రకలకును విజృంభించినది. ఆరురాష్ట్రము లలో కాంగ్రెసుమంత్రివర్గాలు పరిపాలన సాగించుచున్నవి. కాని యీయావర్గాలవారితోగాని, కాంగ్రెస్నాయకులతోగాని మిగిలిన యతివాద మితవాదనాయకులతోగాని యెట్టిసలహాలను చేయకయే, ఏమీ సంబంధము లేకపోయినను భారత

దేశము యుద్ధములో పాల్గొనితీరవలెనని నిర్బంధము చేసినది. ఈయన్యాయపద్ధతికి, అక్రమచర్యకు కాంగ్రెసుమంత్రివర్గాలు కట్టుబడి యుండకూడదనే కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆదేశాను సారంగా కాంగ్రెస్ మంత్రివర్గాలన్ని రాష్ట్రాలలోను రాజీ నామాలు పెట్టి చేతులు కడుక్కొని యీవలకువచ్చారు.

అందరు నాయకులతో బాటు విజయలక్ష్మీపండిట్ కూడా రాజీనామా నిచ్చెను. 1940 సంవత్సరంలో మరల దేశంలో సత్యాగ్రహసమర మారంభమయినది. వందలుకాదు-వేలు కాదు-లక్షలాదిప్రజలు ముందునకేరికి సత్యాగ్రహసవనంలో ఋత్విక్కులుగా వచ్చిపడ్డారు. ప్రభుత్వము వారు కారాగారా లను నింపివేస్తున్నారు. విజయలక్ష్మికూడ సత్యాగ్రహసమరంలో పాల్గొన్నందుకు అరెస్టుచేయబడింది. నాలుగుమాసాలు సామాన్యఖైదుశిక్షవిధించి నైనీసెంట్రల్ జయిలు కామెను పంపింది ప్రభుత్వము. ఆశిక్షాకాలము పూర్తికావడంతో తిరిగి వచ్చి మరల నాయకు లందరితో బాటు, ఉద్యోత్సాగా దేశసేవ చేయడంలో నిమగ్నురాలై నది.

కాంగ్రెసునాయకులు, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీసభ్యులు, ఉపనాయకులు, వారువీరననేల నందరూ ఉవ్వెత్తుగ ప్రచార మారంభించారు. 1941 దేశీయమహాజనసభలో నేమి ముందు చేయతగ్గదో విపులం చర్చించారు. కొందరికి అభిప్రాయ భేదాలు కలిగినాయి. గాంధిగారి వ్యక్తిసత్యాగ్రహోద్యమ

మారంభమయింది. వినోబాభావే ప్రథమతః ఆరంభించాడు. ఈహడావిడంతా చూచి బ్రిటీషుప్రభుత్వం హిందూదేశానికి కాంగ్రెసునాయకులతో సంప్రతింపుల జరుపుటకు క్రిప్సుదొర గారిని రాయబారిగా పంపారు. ఆయనవచ్చి మీాకు డొమీా నియన్ స్టేటస్ యిప్పించుతాను. కానీయుండని సిమ్లాలో సమావేశం జరిపి యేదో యేకరువు పెట్టాడు. కాంగ్రెస్ నాయకులు ఎంతయిస్తే అంతే పుచ్చుకుందామని సిద్ధపడ్డారు. ముస్లింలీగుకంతకీ నేనే యేకైకనాయకుడననీ, యిండియాను హిందూస్థాన్ పాకిస్థాన్ అనే రెండుభాగాలుగా విడగొట్టి మాది మాకిచ్చెయ్యాలని యందని(మాని పండ్ల కజ్జులు సాచి డబ్బా వాయించాడు. క్రిప్సుగారు చేసిన హంగామా యంతా విఫలమై సిమ్లావేశం భగ్నమై పోయింది. క్రిప్సుగారు వచ్చిన త్రోవనే బిక్కముహం వేసుగొని లండన్‌కు ప్రయాణమై త్రోవలో కరాచీలో కాంగ్రెసునాయకులమీాద అపనిందలు వేస్తూ, చిందులు త్రొక్కుగొంటూ గూటికి జేరాడు.

క్రిప్సుగారు తిరుగుప్రయాణసన్నాహం చేసినప్పటినుంచీ కాంగ్రెస్ నాయకులు తీవ్రతరమైన యాలోచనలు, పరిశీలనలు, పరిశోధనలు చేసి తుదకు ఓనిర్ణయానికి వచ్చారు. అంతట్లోకి 1942 ఆగస్టు మొదటితేదీ దగ్గిరబడింది. కాంగ్రెసునాయకులు దేశపరిస్థితులను గురించి తమయనుచరవర్గానికి కార్యాచరణ సందేశాన్ని తయారు చేశారు. ఆసమయంలో రాజకీయవిజ్ఞాన సంపన్నమైన శ్రీమతి విజయలక్ష్మి " మేము అన్యదేశము లనుభ

వించు స్వాతంత్ర్యమును బొందుటలేదు. కాని వేకువదశలో నున్నాము. ఆరంభకిరణములు జగజ్జేగీయమానములుగా ప్రకాశవంతములై ఆశాజ్యోతిని గొల్పుచున్నవి. హిందూ దేశము భవిష్యత్తునందు గొప్పఘనతను పొందును" అని సందేశ మిచ్చినది. ఆమె కొలదిదినములలో స్వదేశానికి మరలి వచ్చింది.

ఆనాడు 1942 ఆగస్టు 8 వ తేదీ దేశచరిత్రలో మున్ముందు సువర్ణాక్షరములతో లిఖించబడే సుదినము. కాంగ్రెసుకార్య నిర్వాహకవర్గము గత రెండుదినములనుండి బొంబాయిలో సమావేశము జరిపి "క్విట్ ఇండియా" తీర్మానము నమలు జరుపుటకు నిర్ణయించి హైందవప్రజానీకమున కొకవిప్లవపూర్వక మైనప్రణాళికతో గూడిన యాజ్ఞాపత్రాన్ని అందజేశారు. కాంగ్రెస్సుకు ప్రభుత్వమునకు భయంకరమైన సంఘర్షణ ప్రారంభమైంది. ఇక నేముంది తెల్లవారితే కొంపలంటుకున్నా యని ప్రభుత్వము కళవళపడిపోయింది. శత్రువేమో ముంగిలి వాకిట వేచియున్నాడు. ఇంటిదొంగలు బందిపోటుకు తయా రయి సిద్ధంగా వున్నారని గజగజలాడి 9-ఆగస్టు 42 వ తేదీ ఉదయం కాంగ్రెస్సునాయకుల నెల్లావున్నవాళ్ళి అలా నిర్బం ధించారు. ఆస్వాతంత్ర్యపోరాటంలో విజయలక్ష్మిగూడ పాల్గొ న్నది. అల్లరులు దేశమంతటా వ్యాపించి విజృంభించినవి. నాయకులనందరినీ యెక్కడకో నిర్బంధించి తీసికొనిపోయారు.

దానితో భారతప్రజానీకం కదుపురగిలి పోయింది. దేశమంతా అట్టుడికిపోయింది. హింసవలననో, అహింసవలననో మాకు కావలసినది స్వాతంత్ర్యమే. దేశమును విడిచి వెళ్ళండి (క్విట్ ఇండియా) అనేధ్వనులతో భారతదేశం మారు మ్రోగింది. స్వాతంత్ర్యముకొఱకు మరణించవలెను. (డు అండ్ డై) అనే గంభీరవాక్యములను బలుకుచు యీప్రభుత్వము మాకువద్దు. అంటూ టెలిఫోనుతీగెలు త్రెంచుట, రైలుపట్టాలను పీకివేయుట, గవర్నమెంటుకార్యాలయాలను, రికార్డులను దహనపఱచుట, యూరపియన్ ఉద్యోగులను పరాభవించుట మున్నగు భయంకరచర్యలు ప్రారంభించారు. సముద్రముకట్ట తెగ యాపుచేసెడివారు కలరా? దానికి ప్రతిఫలముగా ప్రభుత్వము వలసినతావులందు లాఠీచార్జీలు, మెషిన్‌తుపాకులు మున్నగువానితో కాల్పులు సాగించుట చేయుచు ప్రజలయెడ నతికఠినచర్యలు గైకొనిరి. ఆసమయమున విజయలక్ష్మి దేశమంతటను పర్యటన సలిపి స్వాతంత్ర్యముకొఱకై ప్రజలు చేయునల్లరులను మాన్పి శక్తివంచన లేకుండ కృషిసల్పినది. కాల్పులుమున్నగునవి జరిగిన ప్రదేశములకేగి చూచి గాయపడినవారిని నాసుపత్రులందు స్వయముగా జేర్పించి యింకను నెన్నో విధములఁ ప్రజలను సాకుటకు దృఢప్రయత్నములు చేయుచున్నది.

ఇంతలో 1942 ఆగస్టు 12 వ తేదీని యుదయము 2 ఘంటలకు పోలీసువారామెను నిర్బంధింపు వారంటుతో

వచ్చినారు. ఆసమయములో విజయలక్ష్మి భోజనమునకు గూర్చుండి కొంతవరకు మాత్రమే భుజించినది. పోలీసధికార్లు తనకై వేచియున్నట్లు వర్తమానము రాగా భోజనముముగించి బయటకు వచ్చినది. ఆమె యింటివీధివరండాలో కొంతమంది పోలీసుఆఫీసర్లను, రక్షకభటులను, నడివీధిలో పోలీసులారీలను జూచి యామె యించుకేని మనసున తొట్రిలక నిరాయుధు రాలైన యొకస్త్రీని అరెస్టుచేయుటకు ఇంతమంది రావలెనా? అని యనుకొనుచు, మీరు వెంటనే వరండానుండి దిగి బయ టకు పొండని యాజ్ఞచేసినది.

ఆసమయమున కామెగారాబుకూతుం డ్రిరువురును నిద్రాముద్రితులై యుండిరి. వారినిద్రకు భంగము వాటిలకుండ నుండవలెనని యామెతలంపు. అంతలోనే యామె కుమార్తె లిరువురును నిద్రలేచిరి. తల్లి నిర్బంధింపబడబోవు పరిస్థితులు గమనించిరి. తమమాతృదేవతను పోలీసుద్యోగులతో జైలుకు పంప సన్నాహములు చేసినారు. అప్పుడు విజయలక్ష్మికి, తన రెండవకుమార్తె రీటానుగూర్చి యెవరు శ్రద్ధతీసుకొందురను సందేహము కలిగినది. ఆచిన్నిబిడ్డ నేనుగూడ నీవెంట జైలుకు వస్తానని పట్టుబట్టినది. అమ్మా. నీవు రావలదు. నీవిషయమై శ్రద్ధ తీసుకోవలిసింది నీవేయని బుజ్జగించినది. నేను ప్రభుత్వ ముతో పోరాటము సల్పుటకు వెళ్ళుచుంటినని చెప్పి కౌగి లించుకొని ముద్దాడి రోడ్డుప్రక్క బారులు తీర్చియున్న లారీల కడకు వెళ్లెను. పోలీసు ఆఫీసర్లామెను కారులో నెక్కించుకొని

నైనిటాలు జైలుకు గొంపోయిరి. పోలీసు లామె నంను నిర్బంధములో నుంచిరి.

విజయలక్ష్మి తనకు విధించిన కారాగారశిక్ష తొమ్మిది మాసములు అనుభవించి పిదప 11 జూన్ 1943 వ తేదీని విడుదల అయినది. అయితే జైలుజీవితములోని చిక్కుల వలన జైలుఅధికారులు పెట్టుబాధలవలన చేయించు కఠినపు పనులవలన నామెయారోగ్యము పూర్తిగ జెడిపోయినది. అట్లనారోగ్యతతో బాధనొందుచుగూడ నామె తన శరీరారోగ్యము నించుకేని లక్ష్యపెట్టక ప్రజాక్షేమముకొరకై తన కార్యక్రమమును సాగించుచునే యుండెను. ఆతరుణమున నామె శిశుసంరక్షణశాలల నుచితముగా గట్టించి శిశూద్ధరణమొనర్ప చందాలు వసూలు చేసెను.

---

# ౯

# విదేశపర్యటన - ఉపన్యాసపరంపర

"నిరతద్యుండు గుణాఢ్యు డొక్కసుతుడేని న్జాలు గర్భాతురుల్
కొఱగాముల్ పదికోటు లేమిటికి రక్షోయక్షయోధాళి బె
క్కుఱ జక్కాడి యనన్యసంభవసుధాకుంభంబుసాధించి త
ద్గరుడుం దొక్కడ కాడెతీర్చె జననీకార్యం బనాలస్యతన్."

శ్రీమతి విజయలక్ష్మీపండిట్ ముద్దుతనయ లిరువురును అమెరికాలో విద్య నభ్యసించుచున్నారు. తన ముద్దుబిడ్డలను జూచుట కామె 1944 సంవత్సరము నవంబరునెలలో అమెరికా దేశమునకు వెళ్ళినది. అప్పటి కప్పుడే బ్రిటిషువారిచే పంప బడిన బ్రిటిషువార్తాప్రచారకులు భారతదేశములోని రాజకీయ పరిస్థితులను యథాతథముగా అమెరికన్ మిత్రులకు నిర్వచింపబంపి వారని నోటికి వచ్చినట్లెల్ల తప్పుడుప్రచారము చేయుచున్నారు. ఆసంగతిని కర్ణాకర్ణిగ నాలకించిన విజయలక్ష్మి యమెరికా దేశము చేరినతోడనే యచ్చట బ్రిటిషువార్తాప్రచారకులు చేయుదుష్ప్రచారమును గన్నులార చూచి, చెవులార విని, కటకటంబడి తాను అమెరికాదేశస్థులకు భారతదేశయథార్థ రాజకీయవిషయములను దెలుపుటకును, ఆపొట్టకూటికి శాసిం చిన బ్రిటిషువార్తాప్రచారకు లొనరించు దుష్ప్రచారమును ఖండించుటకును బద్ధకంకణయై యాదేశములోని ప్రధానస్థలము లందు సంచార మొనర్పబూనినది.

బ్రిటిషువార్తాప్రచారకులు గాంధీమహాత్ముడును ఇతర సుప్రసిద్ధ కాంగ్రెస్‌నాయకులును జపానువారికి ఏజంట్లనియు, హిందూదేశములోని ధనికులైన పెట్టుబడిదార్ల మద్దతుతో ఫాసిస్టుపద్ధతులను కాంగ్రెస్ అనుసరించుచున్నదనియు, ఆపెట్టు బడిదార్లే బ్రిటిషుప్రభుత్వము అక్కరలేదని చెప్పుచున్నా రనియు, బ్రిటిషువారు హిందూదేశమును వీడినచో మైనార్టీ పక్షములవారిని పెట్టుబడిదార్లు అణగద్రొక్కుట కాలోచించు

చున్నారనియు మొదలగు తప్పుడుపరిస్థితులను అమెరికాదేశ మంతటను ప్రచారము సల్పి పోయిరి.

ఆతరుణములో కాంగ్రెసునాయకులు వేలకొలదిగ జైళ్ళలో మగ్గుచున్నారు. ప్రభుత్వము వారిని విడుదలచేయ లేదు. చేయుతలంపుకూడ లేదు. చేసిన కోపమునిగి పోవునని భయభ్రాంతులై యున్నారు. విజయలక్ష్మీపండిట్ మొదట అమెరికాలోని ప్రముఖులందరకును నేను యిచట నా దేశము తరపున, 40 కోట్లమంది భారతీయులపక్షమున నోరు మెదపు చున్నాను. మీదేశములోవలె మాదేశములో ప్రభుత్వాజ్ఞ బద్ధశాసనములవలన వాక్స్వాతంత్ర్యము లేదు. స్వాతంత్ర్యము పొందక భారతీయులవలెనే బానిసలుగానున్న బర్మా, మలయా, ఇండోచైనా, డచ్చివారి తూర్పిండియాదీవుల విషయమైకూడ మాట్లాడెదను. ఆదేశస్థులకు జపానుచేతులలోనుండి విడుదల కలిగినందువలన స్వాతంత్ర్యము పూర్తిగా లభించినంత సంతోషము కలిగినదని సందేశమిచ్చెను.

విజయలక్ష్మి అమెరికాలో నున్నప్పుడే యాదేశము నందలి సుప్రసిద్ధచారిత్రాత్మక నగరరాజంబగు శాన్‌ఫ్రాన్సిస్కో మహాపట్టణమున నొక శాంతిమహాసభ మిత్రమండలివారు జరుపనుద్దేశించిరి. అప్పటికి భారతదేశము అగ్నిగుండములో నున్నది. అంతకంటె నగ్నిగోళములో నున్నది బ్రిటను కాంగ్రెస్ నాయకులతో ప్రభుత్వమువారు రాజీపడలేదు. రాజీమాటలు

జరుపుటకుగూడ నంగీకరింపలేదు. అట్లాంటిక్ ప్రణాళిక తయారు చేయుటకును ప్రపంచమున శాశ్వతమైన శాంతిని నెలకొల్పనుద్దేశించియు నాజీజము - ఫాసిజము అనుశృంఖలములనుండి యూరపుఖండమును విడుదలనొందించుటకును శాన్ ఫ్రాన్సిస్కో సమావేశము నేర్పాటుగావించిన మిత్రమండలివారు భారతీయులతరఫున భారతదేశమునుండి కొందరు ప్రతినిధుల నెన్నికొని యీసమావేశమునకు రప్పించినారు. భారతీయు లభిప్రాయమును తెలుసుకొనకుండగనే భారతదేశనాయకులతో సంప్రతింపులు జరుపకయే భారతదేశముతరపున ప్రతినిధుల నెన్నికొనిరి. ఆప్రతినిధులు ముప్పురు (1) సర్ ఫిరోజ్ ఖాన్ నూన్. (2) సర్ రామస్వామి. (3) సర్ యం. కృష్ణమాచారి.

ఆ శాన్ ఫ్రాన్సిస్కో సమావేశమునకు హాజరైన ముప్పురు భారతదేశ ప్రతినిధులలో సర్ ఫిరోజ్ ఖాన్ నూను, ఆసభలో పిచ్చివాగుడు వాగాడు. 'నిజము చెప్పాలంటే భారతదేశ మింతదనుకనే స్వాతంత్ర్యమును సంపాదించినది. డొమినియన్ స్టేటస్ యిచ్చినారు. వైస్రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలువారు స్వతంత్రించి దేశక్షేమమును కేయేపద్ధతుల ననుసరించినను రాజప్రతినిధి అడ్డంకులు పెట్టడు' అని ఆయుపన్యాసమువలన నతని కేమియు ప్రయోజనము కలుగలేదు. భారతదేశములోని రాజకీయవేత్తలు, విద్యావంతులు నయినవారందరును నూన్ ఉపన్యాసమును విని యెగతాళి చేసినారు. ఈ ముప్పురుప్రతినిధులలో నేయొక్కరుగాని దేశస్వాతంత్ర్యమును

గూర్చి యొక్కవలుకాడలేదు సరిగదా ప్రభుత్వమువారి మెప్పు లను, మన్ననలను బొందుటకై యెంతేని పాటుపడిరి. దేశ ద్రోహులవడత లిట్లేయుండునుగదా !

ఆసమయమున నమెరికాలోనున్న విజయలక్ష్మి భారత దేశపక్షమున యధార్థపరిస్థితులు తా నాసమావేశములో ప్రసం గించి వెళ్ళదలచుచున్నట్లు మెమోరాండమును బంపినది. దానిపై సమావేశములో హాజరు కావలసినదని యుత్తరువు నంపిరి. అపుడు 1945 సంవత్సరము ఏప్రిల్ మాసాంతమున శాన్ ఫ్రాన్సిస్కోసమావేశములో పాల్గొన నానగరమునకు వచ్చినది. అచట బ్రహ్మాండమైన స్వాగతమును ఆపురవాసులొసంగిరి. ఆసమావేశములో విజయలక్ష్మిపండిట్ ఉపన్యాసరంగమున నిలచి తనముక్తకంఠముతో నైక్యకంఠముగా—

“ ఈసమావేశమునకు భారతీయులపక్షమున ప్రతినిధు లుగా వచ్చితిమని చెప్పుకొను నాముప్పదిపెద్దమనుష్యులకు ప్రతినిధిగా మాట్లాడునంతటి సామర్థ్య మేయొకనికిని లేదు. బాధ్యతగల నాయకులతో వీరు సంప్రతించి వచ్చినవారుకారు. రాజప్రతినిధి పంపగా వచ్చినవారుమాత్రమే. వారిక్కడ చెప్పువిషయములకు, ఓటింగ్‌కు హిందూదేశస్థులు బాధ్యులు కారు. ’ అని విజయలక్ష్మి యుద్ఘాటించెను. అంతతో తృప్తి నహించక యామె హిందూదేశము, బర్మా, మలయా, ఇండో చైనా, డచ్ యీస్టిండీస్ దీవులు వెంటనే స్వాతంత్ర్య దేశములుగా

ప్రకటించవలెనని యీసమావేశమున నొక మెమోరాండము పంపినది. మరియు నాసమావేశమున సెక్రటరీజనరలుకు మెమోరాండము అందజేయబడినది.

' 1945 ఏప్రిల్ 30 తేదీని ప్రెస్ కాన్ఫరెన్సులో మోలటావు చెప్పినట్లు హిందూదేశముతరఫున ప్రతినిధిగా మాట్లాడుటకు నా కవకాశము కలిగినది. మా దేశము స్వతంత్ర దేశము కాదు. కాని హిందూదేశము సంపూర్ణస్వతంత్రదేశముగ పరిగణింపబడు సమయ మాసన్న మగుచున్నది. మా దేశము పక్షమున మాట్లాడుట కవకాశము చిక్కినది గనుక వెంటనే మా దేశమువిషయమై యోచించవలసినదని, మాదేశశాంతి భద్రతలను గాపాడవలెనని యీసభ వారిని కోరుచున్నాను. హిందూదేశములో 40 కోట్లు జనులున్నారు. ప్రాచీనకాలము నుండియు నాగరికతకు పేరొందినది. కాని హిందూదేశమున కింతవఱకు జాతీయప్రభుత్వముగాని, జాతీయజండాగాని లేవు. ప్రపంచజనాభాలో 5 వ వంతుజనాభాగల హిందూదేశము అస్వతంత్రముగా నుండుట మిగుల అన్యాయము. మా దేశము యొక్క స్వాతంత్ర్యము, అభివృద్ధి, శాంతి కాపాడవలసిన బాధ్యత మీపైనున్నది. ఇంపీరియలిజం నశించాలి. హిందూదేశము స్వతంత్ర దేశముగ పరిగణింపబడు సమయము వచ్చు' నని మోలటాల్ చెప్పినాడు. ఇప్పు డెందులకు స్వతంత్ర దేశముగ ప్రకటింపకూడదు. ఇప్పుడు ఫాసిజము, నాజీజములు రూపుమాపబడినవి. ఇంపీరియలిజం ఇంకా తలయెత్తి ఆడు

చున్నది. హిందూదేశమును స్వతంత్ర దేశముగ ప్రకటించినచో ప్రపంచములో శాంతిభద్రతలు నెలకొల్పినట్లే యగును ' అని వక్కాణించెను.

మిత్రమండలివారు విజయలక్ష్మీప్రసంగమునకు బిమ్మట నిచ్చట హిందూదేశస్వాతంత్ర్యమువిషయమై మాట్లాడుటకు వారు సమావేశము కాలేదని, ప్రపంచశాంతినిగురించి మాత్రమే ఆలోచింతురనియు జవాబు చెప్పిరి. పిదప విజయలక్ష్మి యమరికాదేశపుటధ్యక్షుడైన ట్రూమన్‌ను, అతనిభార్యను, ఈజిప్టు, ఇరాక్, అరేబియా విదేశాంగమంత్రులను గలిసికొని, భారతదేశముయొక్క యధార్థపరిస్థితులను వివరించి బ్రిటిషు వారిప్రోత్సాహమున బ్రిటిషువార్తాప్రచారకు లొనర్చిన దుష్ప్రచారముల వేవిధంబుల ఖండించెను.

అనంతరము 1945 మే 14 వ తేదీని సంస్థానముల బడ్జెట్ విషయమై యుపన్యసింప రావలసినదని కాలిఫోర్నియా లెజిస్లేచరువా ( చట్టనిర్మాణమునకు నియమింపబడినవా ) రు సగౌరవముగ విజయలక్ష్మి నాహ్వానించిరి. ఆమెయుపన్యాసమువిను కుతూహలముతో జను లసంఖ్యాలుగా వచ్చిరి. అంత నామె తనమృదుమధురసుస్వనముతో గంభీరపదగుంభన ముక్తాఫలచాతురిని మేళవించి—

' అమెరికాదేశమునకును భారతదేశమునకును గలిగిన యీసమావేశసంబంధములవలన నస్వతంత్రముగా నున్న భారత

దేశ విషయమేగాక యితరములగు బానిసదేశ విషయములను గూడ పర్యాలోచన చేయుసహాయపడు నవకాశము లభించినది. హిందూదేశమువంటి దేశము పరపాలనక్రింద పడరాని పాట్లు పడుచు, పొందరాని యగచాట్లను పొందుచు నస్వతంత్రదేశముగా నున్నంతవరకు ప్రపంచమున నెంతయత్నించినను శాంతి భద్రతలు కలుగనేరవు. ఒకవేళ కలిగినను స్థిరత్వము నందజాలవు. శాంతిభద్రతలు ప్రపంచమున లేనంతకాలమును యుగములు గడచినను, కొన్ని తరములవా రంతరించినను, విశ్వమానవకల్యాణమునకై జేయుప్రయత్నములును, ఉద్యమములును, శుభమయములుగ కొనసాగవు. ఇప్పుడు ప్రపంచమున శాంతిభద్రతలను నెలకొల్పుటకుగాను నూతనరాజ్యాంగము నిర్మింపబడుచున్నది గావున నట్టివిషయమై పాటుపడవలసిన బాధ్యత మీయందున్నదనియు, మీరు పట్టుదలతో నాకార్యభారమును వహింతురనియు నేనువిశ్వసించుచున్నాను. ప్రపంచమునందలి భారతదేశము, అమెరికాదేశములేగాక నమస్తదేశములును ఐకమత్యము గలిగియుండవలెను. ప్రపంచ శాంతిభద్రతలను నెలకొల్పి వాటిని సుస్థిరముగ చేయవలెననిన నన్ని దేశములయొక్క సహాయము, మిత్రత్వము లత్యావశ్యకములు. విజ్ఞానము, వాణిజ్యము, పరిశ్రమను మున్నవానితో నన్ని దేశములవారికిని సంబంధబాంధవ్యములు పరస్పరము కలిగియుండ దగును. ప్రపంచమందలి యన్ని దేశములందలి ప్రజలును సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించుచున్నపుడే పరస్పర

వ్యవహారబాంధవ్యములకు బాట సుగమముగ నేర్పడును. ఈ రోజున భారతదేశమే సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించుచున్న యెడల, ప్రపంచశాంతిభద్రతల పునర్నిర్మాణములకై బాధ్యత వహించి యాశాన్‌ఫ్రాన్సిస్‌కో సమావేశము జయప్రదముగా జరిగించి యుండెడిది. భారతీయుల న్యాయమైన కోర్కెల నంగీకరింపక భారతీయు లన్నివిధముల చేతను నిరసించబడి, తిరస్కరింపబడుటవలననే యీసమావేశములును, ప్రపంచశాంతిభద్రతల నెలకొల్పు యత్నములును విఫలములయినవి. తీర్మానములను జరిపినంతమాత్రమున ప్రయోజనమణుమాత్రమైన లేదు. అవి సుస్థిరమార్గమున నమలు జరిగిననాడే యుపయోగకరములై సిద్ధినొందును. మీరు స్వాతంత్ర్యము నభివృద్ధి నొందించుకొన్నంతమాత్రమున మీలో ఘనత లేదు. మీ రనుభవించు స్వాతంత్ర్యమునే యితరులుకూడ పొందుటకు మీరు కృషి చేయవలెను' అని ఘంటాపథముగా నుద్ఘోషించెను.

మఱియొక దినమున కాలిఫోర్నియా నగరములోనే సంయుక్తరాష్ట్రసమ్మేళనమునుగూర్చి 5000 సిక్కువీరులున్న మహాసభలో వారికి హితము గరుపు నుద్దేశముతో కారుమేఘములవలెనున్న హిందూదేశరాజకీయములు నాకు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఇప్పటిరాజకీయపరిస్థితు లించుక బాగుగనే యున్నవి. కాని మన కింకను స్వాతంత్ర్యము లభింపలేదు. మనము చాలకాలమునుండి స్వాతంత్ర్యపోరాటమును జరుపుచునే యున్నాము.

అది కేవలము నొక్కి మన దేశము విషయమాత్రమే గాదు. ప్రపంచమున బానిసలుగా బ్రదుకు ప్రజలు నివసించు నన్ని దేశముల విషయమైకూడ నని వక్కాణించెను. పిదప నమెరికా ప్రజలనుగూర్చి, మా స్వాతంత్ర్య పోరాట మింతటిలో నణగిపోవునది కాదు. మీ అమెరికనులు శాన్ ఫ్రాన్సిస్కో సమావేశములో న్యాయముగ, చర్చలను జరుపుదురని, శాంతి నెలకొల్పగలుగుదురని యాశించియుంటిమి. ముందుగా ప్రజల యభిప్రాయములను తెలుసుకొనకపోవుటచే శాంతిభద్రతల నెలకొల్పుయత్నము సఫలము కాలేదు. భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించినచో మిగిలిన చిన్న చిన్న దేశముల కన్నింటికిని స్వాతంత్ర్యము లభించును. ఫాసిజమును అణగ ద్రొక్కవలెనని యత్నించుచున్నారు. కాని ఫాసిజమునకు, ఇంపీరియలిజమునకు కారణములు తెలుసుకొనుటలేదు. ఆ రెండుకూడ అణగద్రొక్కబడినప్పుడే ప్రపంచశాంతి యేర్పడును. అంతవఱకు నిట్టిసమావేశము లెన్ని జరిపినను శాంతి భద్రతలు యేర్పడజాలవు.

# ఉపసంహారము.

శ్రీమతి విజయలక్ష్మివంటి రాజకీయవిజ్ఞానసంపన్నయగు మహిళామణి జన్మించిన నెహ్రూకుటుంబము భారతదేశమందలి గృహస్థలోకకదంబమున మేలుబంతిగా నెన్నుకొనబడదగినదై యున్నది. నెహ్రూకుటుంబములోనివారు రాజకీయములలో పాల్గొన్నతర్వాత పొందిన కష్టములు హిందేశములోని ప్రతి యొక్కొక్కవ్యక్తికి సంపూర్ణముగా తెలియుననుటకు సందేహింప నక్కఱలేదు. వారు సకలభోగభాగ్యసంపన్నులై యఖండైశ్వర్యముతో తులతూగినారు. అట్టివారికి హఠాత్తుగా పరస్పరవియోగము, కారాగారజీవితములను గడపుట సంభవించుటవలన పెక్కుపర్యాయము లనారోగ్యతకు పాల్పడి వారిలో పలువిధములైన మార్పులు వచ్చినవి. వారనుసరించెడి మార్గము న్యాయమైనదని వారు గుర్తించియున్నారు. అందువలన నెట్టియిక్కట్టులు సంభవించినను, యెట్టిచెడుసంఘటనల నెదుర్కొనినను వారు కొంచెమైనను లక్ష్యపెట్టలేదు. కష్టముల నెదుర్కొనుటలోనే ఆనందము కలదనియు, పట్టుదలతో కృషి యొనర్చినచో నెప్పటికైన విజయము కలిగితీరుననియు నాకుటుంబమువారి హృదయనిశ్చితాభిప్రాయమై యున్నది.

మరియు నామె భారతనారీమణులలో నదృష్టవంతురాండ్రైనవారిలో నదృష్టవంతురాలు. పుట్టిననాటికే భోగ

భాగ్యములతో తులతూగుచుండుట కేవలము అదృష్టము కానేరదు. జవహారులాల్ నెహ్రూవంటి సోదరుని గలిగి యుండుటే యదృష్టము. సగర్భ్యరాలగు నావిదుషీమణికి నెహ్రూపండితుడు సోదరుడగ జన్మించి, స్నేహితుడుగను, మార్గదర్శకుడుగను, సోదరప్రేమగలవాడుగాను నుండుటయే అదృష్టము. ఇంకను విజయలక్ష్మి రాజకీయదృక్పథమున సోదరుని యడుగుజాడలనే యనుసరించి, ఆయనవలెనే త్యాగము చూపి, రాజకీయకములలో ముందడుగు వేయుటవలననే నేడామె ఖండఖండాంతరములందుగూడ ప్రఖ్యాతి నందుటకు కారణభూతములైనవి. ఆసోదరీసోదరుల కొండొరులగల యనిర్వచనీయము, వర్ణనాసాధ్యమునైన ప్రేమకలిగి పరస్పరము గౌరవభావములు గలిగియున్నారు. అందువలననే యూమె భారతదేశనారీమణులలో నొకచంద్రబింబము. ఆయన భారతీయపురుషశ్రేణిలో అగ్రగణ్యుడు. శ్రీమతివిజయలక్ష్మి విజయకేతనమును హిందూదేశమున స్థాపించగలుగుటలో ముందంజవైచి విజయమంది మున్ముందింతకంటె నిరోధికాభివృద్ధిని, జయపరంపరను బొందెడిని.

---

Paper Supplied by Party—E. G. 34. Copies 1000.
Sree Satyananda Press, Rajahmundry—E. G. 107. 20-2-1947.

శ్రీ

# వివేకానందస్వామి

## జీవితము.

రచయిత: యమ్. గంగాధరశర్మగారు

ఏ యుగపురుషుడు బాల్యమునుండి మహావేశపరుడై, పట్టపరీక్షనిచ్చి బ్రహ్మసమాజసంపర్కమున సన్యాసమన్న నమ్మకము లేక యానాటికి వంగదేశమున పరమహంస యనిపించుకొని పూజనీయుడగు రామకృష్ణపరమహంస సన్నిధి కేగి యాతని శిష్యుడై గురుచరణసాన్నిధ్యమున మతతత్త్వమెఱింగి సన్యసించి తన్మతమును ప్రచారింప పాశ్చాత్యదేశములకేగి యమెరికాదేశమున చికాగోనగరమున జరిగిన ప్రపంచ సర్వమతవిమర్శక మహాసభలో హిందూమతమునుగూర్చి మహోపన్యాస మొనర్చి సర్వమతప్రతినిధులను దిగ్భ్రమ నొందించి, యటనుండి యూరపుదేశమంతటను హిందూమతసంప్రదాయ చంద్రికలు వెదజల్లి వేలకొలది విదేశీయులను సన్యాసులుగ, శిష్యులుగ గ్రహించి మించి భక్తియోగ, కర్మరహస్య, నిస్సంగ, ముక్తి కర్మరహస్యాది శీర్షికలపై యుజ్జ్వలోపన్యాసము లొసంగిన కర్మవీరుడో యాతని సంపూర్ణజీవిత మిందువర్ణితము.

**వెల 0—12—0**

వలయువారు :—

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్, రాజమండ్రి.